# వేములవాడ చరిత్ర - శాసనములు

బి. ఎన్. శాస్త్రి ఎం. ఏ.

ప్రచురణ

**మూసీ పబ్లికేషన్స్**

మూసీ - చారిత్రక, సాంస్కృతిక మాస పత్రిక,

8-4-245/1, లింగంపల్లి, హైదరాబాదు - 500 027

ప్రథమ ముద్రణము 1991

ప్రతులు - 2000



**వెల రూ. 100-00**

ముద్రణ

పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్,

1-1-517/B/1 న్యూ బాకారం, గాంధీనగర్

హైదరాబాదు - 500 380

ఫోన్ నెం. 68413

# విషయసూచిక

## వేములవాడ చరిత్ర - శాసనములు


| | | | పుటలు |
|---|---|---|---|
| 1 | వేములవాడ | ... | 1 |
| 2 | వేములవాడలో నిర్వహింపబడు ఉత్సవములు | ... | 21 |
| 3 | భవిష్యోత్తర పురాణమందలి రాజేశ్వరక్షేత్ర మాహాత్మ్య అర్చన శ్లోకములు | ... | 37 |
| 4 | వేములవాడ చాళుక్యులు | ... | 41 |
| 5 | సత్యాశ్రయ రణవిక్రముడు | ... | 49 |
| 6 | పృధ్వీపతి | ... | 50 |
| 7 | మహారాజు | ... | 51 |
| 8 | రాజాదిత్య పృథు విక్రముడు | ... | 51 |
| 9 | వినయాదిత్య యుద్ధమల్లుడు | ... | 52 |
| 10 | మొదటి అరికేసరి | ... | 53 |
| 11 | మొదటి నరసింహుడు | ... | 56 |
| 12 | రెండవ యుద్ధమల్లుడు | ... | 57 |
| 13 | బద్దెగుడు | ... | 57 |
| 14. | మూడవ యుద్ధమల్లుడు | ... | 59 |
| 15 | రెండవ నరసింహుడు | ... | 59 |
| 16 | రెండవ అరికేసరి | ... | 61 |
| 17. | వాగరాజు | ... | 67 |
| 18 | బద్దెగుడు | ... | 68 |
| 19 | మూడవ అరికేసరి | ... | 68 |
| 20 | వేములవాడ చాళుక్యులనాటి సాంఘిక చరిత్ర | ... | 70 |

## వేములవాడ శాసనములు


| | | | |
|---|---|---|---|
| 21 | రెండవ అరికేసరి కరీంనగర్ శిలాశాసనము | ... | 95 |
| 22 | రెండవ అరికేసరి వేములవాడ శిలాశాసనము | ... | 98 |
| 23 | కుర్క్యాల గండ శిలాశాసనము | ... | 104 |
| 24 | బద్దెగుని వేములవాడ శిలాశాసనము | ... | 110 |
| 25 | మూడవ అరికేసరి నాటి రేపాక శిలాశాసనము | ... | 111 |
| 26 | ఆహవమల్లుని నాటి వేములవాడ శిలాశాసనము | ... | 114 |
| 27 | చికరాజు వేములవాడ శిలాశాసనము | ... | 119 |
| 28 | కుమార సోమేశ్వరుని వేములవాడ శిలాశాసనము | ... | 123 |
| 29. | జగద్దేవరాజు వేములవాడ శిలాశాసనము | ... | 125 |
| 30 | వేములవాడ కేదారేశ్వరాలయ శాసనము | ... | 127 |
| 31 | కురువగట్టు శాసనము | ... | 128 |
| 32 | శ్రీ రాజరాజేశ్వర సుప్రభాతమ్ | ... | 129 |
| 33. | శ్రీ రాజరాజేశ్వరి సుప్రభాతమ్ | ... | 132 |
| 34, | శ్రీ రాజరాజేశ్వర స్తోత్రమ్ | ... | 133 |
| 35 | శ్రీ రాజరాజేశ్వర ప్రపత్తిః | ... | 134 |
| 36 | శ్రీ రాజరాజేశ్వర మంగళమ్ | ... | 135 |
| 37 | ఉపయుక్త గ్రంథములు | ... | I |
| 38 | ముఖ్యపదానుక్రమణిక | .. | II |

# ఛాయాచిత్రములు—శాసనప్రతిబింబములు

1 వేములవాడ పట్టణ ప్రవేశద్వారము
2 రాజరాజేశ్వరాలయ ఆవరణ ప్రవేశద్వారము
3 శివుని విగ్రహము
4 రాజేశ్వరాలయ సింహద్వారము
5 మహానంది
6 రాజేశ్వరాలయ ప్రధాన ద్వారము
7 రాజేశ్వరాలయ గోపురము
8 రాజేశ్వరాలయము-కోటిలింగము లనబడు ద్వాదశ శివలింగములు
9 శివ పంచాయతనము
10 దక్షిణామూర్తి ఆలయము
11 గండాదీప స్తంభము
12 కల్యాణ మంటపము పైభాగము
13 కాశీ విశ్వేశ్వరాలయము
14 సుబ్రహ్మణ్యేశ్వరాలయము
15 కల్యాణమంటపము
16 బాల రాజేశ్వరాలయము
17 రాజేశ్వరాలయము-వ్రత పీఠములు
18 రాజేశ్వరస్వామివారి వాహనములు
19 కోడెలను నిలుపు స్థలము
20 కోడెలు
21 భీమేశ్వరాలయ గర్భగుడి, పూజారి
22 భీమేశ్వరాలయ గోపురము
23 భీమేశ్వరాలయ మందలి సప్త మాతృకలు
24 భీమేశ్వరాలయము-చతుర్ముఖుడు
25 భీమేశ్వరాలయము-ఆంజనేయస్వామి
26 భీమేశ్వరాలయము-శివుని విగ్రహము
27 ఎల్లమ్మగుడి ఆవరణమందున్న విగ్రహములు
28 ఎల్లమ్మ దేవత
29 తిప్పాపురము-ఎల్లమ్మ గుడి
30 బద్ది పోచమ్మ గర్భగుడి
31 బద్ది పోచమ్మ అమ్మవారు
32 బద్ది పోచమ్మ గుడి
33 కేదారేశ్వరాలయము

34 కేదారేశ్వరుడు
35 ధర్మకుండము చెంతనున్న శివలింగము
36 భీమేశ్వరాలయము-నవగ్రహమంటపము
37 నందీశ్వరుడు
38 నగరేశ్వరాలయ సింహద్వారము
39 నగరేశ్వరాలయ గర్భగుడి
40 తటాకము
41 ధర్మకుండ మార్గము
42 ధర్మకుండము చేరుటకు నిర్మించిన మార్గ మంటపము
43 రాజేశ్వరాలయము-సాధారణ దృశ్యము
44 తటాకము-రాజేశ్వరాలయము
45 నవగ్రహములు
46 ధర్మకుండమువద్దగల శివలింగము
47 మహాగణపతి
48 కేదారేశ్వర లింగము
49 రాజేశ్వరాలయ ఆవరణమందున్న దర్గా
50 ధ్వజస్థంభము
51 శివలింగము, గణపతి, తదితర విగ్రహములు
52. రాజేశ్వరాలయము-వాహనశాల
53 రాజేశ్వరాలయము-హోమకుండము-ఆలయోద్యోగులు
54 పర్వతగిరి ధర్మశాల
55 తిరుమల-తిరుపతి దేవస్థానము వారి సత్రము
56 రాజరాజేశ్వరస్వామి సంస్కృత పాఠశాల, కళాశాల భవనము
57 రాజేశ్వరాలయ అర్చకులు-శ్రీయుత నందగిరి శంకరయ్య, శ్రీయుతులు మామిళ్ళపల్లి శ్రీరాములు, ఆలయ సిబ్బంది
58 రెండవ అరికేసరి కరీంనగర్ శిలాశాసనము 1-4
59 రెండవ అరికేసరి వేములవాడ శిలాశాసనము 1-4
60 కుమారసోమేశ్వరుని వేములవాడ శిలాశాసనము-మొదటి ప్రక్క
61 చికరాజు వేములవాడ శిలాశాసనము మొదటిప్రక్క
62 జగద్దేవరాజు శిలాశాసనము
63 రాజాదిత్యుని వేములవాడశిలాశాసనము

— ౦ —

# మనవి

తెలంగాణ మాగాణమున ప్రసిద్ధి గాంచిన శైవ క్షేత్రములలో వేములవాడ రాజరాజేశ్వర క్షేత్రము ప్రథమ గణ్యమైనది

కరీంనగర్ జిల్లా పూర్వము, సబ్బి సాయిర మండల మనబడినది. రాష్ట్రకూట చక్రవర్తుల విధేయ సామంతులుగా నున్న చాళుక్య వంశజులు బోధన్ నగరమును రాజధానిగా సపాదలక్ష దేశ మును క్రీ శ 641 నుండి క్రీ. శ. 1052 వరకు పాలించి యుండిరి

బోధన్ సపాదలక్ష దేశ పాలకులైన చాళుక్యులకు కొంత కాలము వేములవాడ రాజధానిగా నుండెను. కావున వీరు వేములవాడ చాళుక్యు లనబడినారు

వేములవాడ చాళుక్యులు జైన మతానుయాయులు. ఈ వంశమున కొందరు రాజులు శైవ మతాభిమానులుగ నుండిరి. వీరి పరిపాలనా కాలమున వేములవాడ, గంగాధర, కుర్క్యాల, బోధన్ పట్టణములం దనేక జినాలయములు, జైనబసదులు, మఠములు నిర్మింపబడినవి.

వేములవాడయందున్న రాజరాజేశ్వరాలయము, భీమేశ్వరాలయము, బద్దిగేశ్వరాలయము, నగరేశ్వరాలయము లతి పవిత్రమైనవిగను, మహిమాన్వితమైనవిగను భావింపబడుచున్నవి వేములవాడ లోనున్న ధర్మకుండమందలి జలమున గ్రుంకులిడినవారి పాపములు నశించునని స్థలపురాణాదులు తెలుపుచున్నవి

దక్షిణ కాశిగా పేరు పొందిన వేములవాడ చరిత్ర, ఆలయముల వివరము, ఉత్సవములు, చాళుక్యుల చరిత్ర - సంస్కృతి, వారికి సంబంధించిన శిలా శాసనములు, వేములవాడలోనున్న అన్య రాజ వంశీయుల శాసనము లీ గ్రంథమున చేర్చబడినవి

జైన, శైవ మతములకు వేములవాడ కేంద్రము వేములవాడ చాళుక్యులలో రెండవ అరికేసరి మహారాజు ప్రబల శక్తి సమన్వితుడు కన్నడ భాషా పోషకుడు

పంప మహాకవి, విక్రమార్జున విజయమును కన్నడ భాషలో రచించి రెండవ అరికేసరివలన ధర్మపురి అగ్రహారమును పొందెను. పంప కవి సోదరుడు జినవల్లభుడు కుర్క్యాల, గంగాధర ప్రాంతములందు జిన భవనములను నిర్మించి, కన్నడ భాషా పోషకునిగ కీర్తి గాంచెను

శ్రీ రాజరాజేశ్వరస్వామి వారిపై నాకు గల భక్తిభావ మీ గ్రంథ రచనమునకు స్ఫూర్తి కలిగించినది కావున వేములవాడ చరిత్ర - శాసనములు అను నీ గ్రంథమును శ్రీ రాజరాజేశ్వరస్వామి వారికే నంకితము గావించినాను 1986 - 87 వ సంవత్సరమున కరీంనగర్ జిల్లాలోని గజ సింగ వరము గ్రామ సర్పంచ్‌గను, వేములవాడ దేవస్థాన కమిటీ కార్యవర్గ సభ్యునిగను నున్న శ్రీ జగన్మోహన్‌రావుగారు వేములవాడ క్షేత్రమునకు సంబంధించిన గ్రంథమును రచింపుమని నన్ను కోరియుండిరి వారి కోరిక ఈనాటికి పూర్తి యైనది

ఛాయాచిత్రములను, శాసన ప్రతిబింబములను తీసి యిచ్చిన శ్రీ నగేశ్ గారికి, చిత్రపటములను చక్కగా ముద్రించి యిచ్చిన శ్రీ ఓంసాయి గ్రాఫిక్స్ అధినేతలకు, గ్రంథమును సుందరముగ ముద్రించిన శ్రీ పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ వారికి, నా కృతజ్ఞతాపూర్వక ధన్యవాదములు ఈ గ్రంథము చివర మద్గురువర్యులు కీ. శే. డా॥ దివాకర్ల వేంకటావధానిగారు కూర్చిన వేములవాడ రాజేశ్వరస్వామి వారి సుప్రభాతమును చేర్చినాను

నా రచనలో ఏవేని దోషములున్న సహృదయులు మన్నించి తెలిపిన మలి ముద్రణమున సవరించుకొనెదనని మనవి చేయుచు ఆంధ్రదేశమునకీ గ్రంథము నందించుచున్నాను

— బి. ఎస్. శాస్త్రి

తేది 1-11-1991
8-4-245/1
లింగంపల్లి
హైదరాబాదు - 500027

# అంకితము

వేములవాడ

శ్రీ రాజరాజేశ్వర స్వామివారి

పాద పద్మములకు

భక్తితో

—వి. ఎస్. శాస్త్రి

# వేములవాడ చరిత్ర – శాసనములు

**వేములవాడ .**

తెలంగాణమందున్న సుప్రసిద్ధ శైవక్షేత్రములలో వేములవాడ ప్రథమగణ్యమైనది కరీంనగర్ జిల్లాలోని వేములవాడ మండలకేంద్రమందున్న శ్రీ రాజరాజేశ్వరాలయము అతి ప్రాచీనమైనది ఈ ఆలయము సపాదలక్షదేశమును పోదన నగరమును రాజధానిగా పాలించిన చాళుక్యవంశపు రాజుల కాలమున నిర్మింపబడినది

కరీంనగర్ జిల్లాలోనున్న కాళేశ్వరక్షేత్రము పావన గోదావరి నదీతీరమందున్నది. ఆంధ్రదేశమున వర్ధిల్లియున్న త్రిలింగక్షేత్రములలో కాళేశ్వరము మొదట పేర్కొనదగినది రాయలసీమలోని శ్రీశైలము, తీరాంధ్రమందున్న ద్రాక్షారామము, తెలంగాణమందలి కాళేశ్వరము త్రిలింగక్షేత్రములుగా వ్యవహరింపబడుచున్నవి

కొలనుపాక, అలంపురము, ఐనవోలు, ఏలేశ్వరము, చెన్నూరు, కాళేశ్వరము, ఉమామహేశ్వరము, కేసరి రామలింగేశ్వరము, పేరూరు, పానుగల్లు, ఉత్తర రాజరామేశ్వరము, వాడపల్లి, ఇంద్రపురివంటి శైవ క్షేత్రములు, యాదగిరిగుట్ట, వాడపల్లి, మట్టపల్లి, లింబాద్రి, బూరుగుగడ్డ, అరువపల్లి, శ్రీరంగాపురము, సింగపట్నము, మామిండ్లపల్లి, వట్టెము, గంగాపురము, సిరిసనగండ్ల, కొండగట్టు ధర్మపురి, భద్రాచలమువంటి వైష్ణవ క్షేత్రములు, గంగాధర, జైనద, ఆల్వాన్‌పల్లి, కొలనుపాక, సిరికొండ, కుర్క్యాల మొదలగు జైనతీర్థములు, ఇంద్రపురి, కొండాపురము, గాజులబండ, ఫణిగిరి, రామిరెడ్డిపల్లి, ధూళికట్ట, చైతన్యపురి, నాగార్జునకొండ ఆదిగాగల బౌద్ధమత కేంద్రములు తెలంగాణమాగాణమున ప్రసిద్ధిగాంచినవి

ఇవిగాక జాన్‌పాడ్, జలాల్‌పూర్, జహంగీర్ పీరా, యూసిఫ్ షరీఫ్, భువనగిరివంటి ముస్లిం యాత్రస్థలము లిచట నున్నవి దక్షిణాపథమం దత్యున్నతమైన చర్చి మెదకు పట్టణమందున్నది

ఆంధ్రదేశమును పాలించిన మహా సామ్రాజ్యాధినేతలు, చక్రవర్తులు తెలంగాణమున జన్మించినవారే శాతవాహనులు, కరీంనగర్ జిల్లాలోని కోటిలింగాల ప్రాంతమున తొలుత గణతంత్ర పాలకులుగానుండి మౌర్యసామ్రాజ్య పతనానంతరము విశాల సామ్రాజ్యాధిపతులైనారు

నల్లగొండ జిల్లాలోని ఇంద్రపురి రాజధానిగా పాలించిన విష్ణుకుండిన వంశీయులు చక్రవర్తులుగ కీర్తి గాంచినారు ఈ రాజన్యులు ప్రాగ్దక్షిణ, పశ్చిమ సముద్రములు, రేవానది అనగా

నర్మదానది తమ సామ్రాజ్యపు టెల్లలుగా, దక్షిణాపథ దక్షిణ భారతముల నేకచ్ఛత్రాధిపత్యమున పాలించినారు

రాష్ట్రకూట, కల్యాణీవంశజుల సామంతులుగానున్న కాకతీయుల ఓరుగల్లు పట్టణమును రాజధానిగా చేసికొని సర్వాంధ్రభూభాగముల నేకముచేసి మహాసామ్రాజ్యమును నిర్మించి పాలించినారు

గోలకొండ పట్టణమును కేంద్రస్థానముగ చేసికొని, కర్ణాటాంధ్ర, తెలంగాణ ప్రాంతములను పాలించిన కుతుబ్షాహీ వంశీయులు మహాసామ్రాజ్యాధినేతలుగ వ్యవహరించినారు

ఇట్లు తెలంగాణము క్రీ పూ నుండియు నేటివరకు రాజకీయముగా బలీయమైనదిగా ప్రసిద్ధి గాంచినది

కరీంనగర్ జిల్లాలోని వేములవాడ అత్యంత ప్రాచీనమైన పట్టణము. జైన, బౌద్ధ మహా యుగములందీ నగరము గణతంత్ర రాజ్యమునకు కేంద్రస్థానమై యుండెను ఇచట లభించిన జైన, బౌద్ధమతములకు సంబంధించిన విగ్రహములు, శిథిల జైన బసదులు, బౌద్ధమత సంబంధమైన ఆరామ విహారములు నగర మతిప్రాచీనమైన దనుటకు నిదర్శనములు

పురాణములు వేములవాడ క్షేత్రమున కత్యంత ప్రాధాన్యము నిచ్చినవి క్షేత్రమాహాత్మ్యమును వేనోళ్ళ చాటినవి పురాణములు రాజరాజేశ్వర క్షేత్రమును, ధర్మకుండమును ప్రశంసించినవి పురాణ ములందీ క్షేత్రమునకు సంబంధించిన అనేక గాథలున్నవి క్షేత్రమాహాత్మ్యమును తెలుపు పురాణగాథ లిచట సంక్షిప్తముగ వ్రాయబడినవి

భారతావనియందున్న సమస్త క్షేత్రములం దేక్షేత్రము ఉత్తమమైనదిగను, మాహాత్మ్యము కలదిగను నున్నదియో నట్టి క్షేత్రమును తెలుపుమని సూతపౌరాణికుని శౌనకాది మహామును లర్థించిరి

"నారద మహర్షి, భూలోకవాసులు పాపకర్మలచేతను, జరామరణములచేతను, అనేక రుగ్మతలచేతను పీడింపబడుచున్నవారు వారి నుద్ధరించు తలంపుతో కైలాసవాసుని దరిచేరి, పరమ శివుని దర్శించి, మానవలోకమును పాపకర్మలనుండి రక్షించుమని ప్రార్థించెను నారద మహర్షి విన్నపమాలకించి పరమశివుడు పుణ్యరాశియగు కాశిని వీడి ప్రశాంత వాతావరణముగల రాజేశ్వర క్షేత్రమున నివసింపసాగెను లయకారుడును, దేవతలలో శ్రేష్ఠుడును, జగత్పితయనగు కైలాసపతి వేములవాడలో స్థిరముగ నివసించుటవలన రాజేశ్వర క్షేత్ర ముత్తమోత్తమమైన పుణ్యస్థలిగా ప్రసిద్ధి గాంచెను

అమరాధిపుడు వృత్రాసురుని సంహరించిన పిదప బ్రహ్మహత్యా పాపనివారణ కనేక దివ్య క్షేత్రములను దర్శించి, ఫలితము గానక బృహస్పతి నేక్షేత్ర సందర్శనమువలన తన పాప పంకిలము



వేములవాడ పట్టణ ప్రవేశ ద్వారము



రాజరాజేశ్వరాలయ ఆవరణ ప్రవేశ ద్వారము

ప్రక్షాళనమగునని ప్రశ్నించెను. దేవ గురువు, ఇంద్రుని, రాజేశ్వర క్షేత్రమును దర్శించుమని తెలిపెను దేవేంద్రుడు రాజేశ్వర క్షేత్ర మేతెంచి అచటి ధర్మకుండమున స్నానమాడి రాజేశ్వరు నర్చించి, పవిత్రుడై స్వర్గమును చేరెను"

దక్ష ప్రజాపతి గంధమాదన పర్వతమున యాగ మొనర్చు సమయమున మంత్ర పూతమగు హవిస్సును భాస్కరు డపహరించి తన బాహువులను కోల్పోయెను పాపోపశమనమున కతడు గోదావరి నదీ తీరమందున్న విప్రులవలన రాజేశ్వర క్షేత్ర మాహాత్మ్యమును విని, వేములవాడ కేతెంచి, ధర్మకుండమున స్నాన మొనర్చి, విధి విధానమున రాజేశ్వరు నర్చించి, స్వర్ణ బాహువులను పొందెను. కావున ఈ ప్రదేశము భాస్కర క్షేత్ర మనబడినదని స్థలపురాణము నుడువుచున్నది

మహిషాసురు డపరిమిత బలపరాక్రమము లున్నవాడు అతడు వరగర్వితుడై సమస్త దేవతలను హింసింపసాగెను దేవతలు బ్రహ్మ నాశ్రయించి మహిషాసురుని దురంతముల నెఱింగించిరి విధాత విష్ణువు నాశ్రయించెను విష్ణువు బ్రహ్మ సమస్త దేవతలు రాజేశ్వర క్షేత్రమేతెంచి ఆ దేవ దేవుని ప్రార్థించి మహిషాసుర సంహార మార్గమును సూచించుమని కోరిరి

రాజేశ్వరుడు సమస్త దేవతల అంశములను, తన తేజస్సును ఏకముచేసి మరో తేజస్విని యగు స్త్రీని రూపొందించి, దివ్యాస్త్రములను ప్రసాదించి, రాక్షస సంహార మొనర్చుట కాదేశించెను మహిషాసురుని సంహరించి, మాత మహిషాసురమర్దనిగా పూజింపబడినది వేములవాడలో మహిషాసుర మర్దని కాలయము నిర్మింపబడినది

దక్ష ప్రజాపతి కొమరిత సతీదేవి ఆమె జటాజూటధారి యగు శివుని వివాహమాడెను దక్షునకా వివాహ మంగీకారము కాకుండెను ఒక పర్యాయము దక్షుడు సకల దేవ, మునిగణముల నాహ్వానించి, మహా సత్రయాగము నిర్వహించెను. ఆ యజ్ఞమునకు శివుని ఆహ్వానింపలేదు తండ్రి యొనర్చు యాగమునకు భర్త వలదనినను వినక సతీదేవి వచ్చి అవమానములకు గురియై తన శరీరము నగ్నికాహుతి యొనర్చి మరణించెను

శివుడా విషయమును తెలిసికొని రుద్రుడై దక్షాధ్వర ధ్వంసము గావింపుమని వీరభద్రుని పంపెను వీరభద్రుడు మహా సత్రయాగ విధ్వంస మొనర్చెను శివుని దయవలన పునర్జీవితుడైన దక్షుడు తన తప్పిదమును తెలిసికొని, ఆ దేవ దేవుని శరణు వేడెను శివుడాతని కభయమిచ్చెను. వీరభద్రుని విగ్రహము లీ ప్రాంతమందున్నవి వేములవాడ ప్రాంతము దక్షవాటిక యని స్థలపురాణమం దభివర్ణింపబడినది

త్రేతా యుగమున పితృవాక్య పరిపాలనార్థము రఘురాముడు అరణ్యవాస మొనర్చు కాలమున రాజేశ్వర క్షేత్ర మేతెంచి, ఒక రాజహంస రాజేశ్వరు నర్చించుటను గాంచి, భస్మధారియై రుద్రాక్ష మాలను ధరించి శైవ దీక్షగొని స్వామి నర్చించెనని తెలియుచున్నది

ద్వాపర యుగమున పాండవులు అరణ్యవాస కాలమును గడపుచు, వ్యాసమహర్షి ఆజ్ఞానుసారము, వేములవాడను చేరిరి అచట ధర్మజుడు రాజేశ్వరుని, భీముడు భీమేశ్వరుని, అర్జునుడు బాల రాజేశ్వరుని, నకులుడు సోమేశ్వరుని, సహదేవు డుమామహేశ్వరుని భక్తి శ్రద్ధలతో పూజించిరి ధర్మజుడు దివ్యశంఖమును, భీముడు గదను, ఫల్గుణుడొక దివ్య బాణమును, నకులుడు సుఘోషము, సహదేవుడు మణిపుష్పకమను శంఖములను, ద్రౌపతి అఖండ సౌభాగ్యమును పొందిరి

ద్వాపర యుగాంతమున, కలియుగారంభమున దుష్టశక్తుల విజృంభణము జరిగినది అవినీతి, ఆశ్రిత పక్షపాతము, స్వార్థచింతన, కలహములు, కలుగుట వలన రాజేశ్వరస్వామి ధర్మకుండమున నివసించెను కొంతకాలము గడచిన తరువాత మాళవాధిపుడగు రాజరాజనరేంద్రుడొక విప్ర బాలుని పొరపాటున మృగమని భావించి బాణముతో కొట్టెను ఆ బ్రాహ్మణ బాలుడు మరణింప నృపుడు పాప పంకిలుడై రుగ్మతకు లోనయ్యెను అత డనేక తీర్థములందు గ్రుంకులిడినను మనస్తాపము నుండి కోల్పోవలేదు అతడు వేములవాడ కేతెంచి ధర్మకుండమును గాంచి అందలి పావనోదకమును ముమ్మారు సేవించి విశ్రమించెను

రాజరాజ నరేంద్రునికి రాజేశ్వరస్వామి స్వప్నమున సాక్షాత్కరించి, ధర్మకుండ మందున్న తనను వెలికితీసి ఆలయమును నిర్మించి ప్రతిష్ఠించ మనెను రాజు మేల్కాంచి, రాజేశ్వరస్వామిని ధర్మకుండమునుండి వెలికితీసి ఆలయమును నిర్మించి ప్రతిష్ఠించెను ధర్మకుండమునకు ఎక్కుని సోపానములను నిర్మించెను

రాజేశ్వర స్వామి కృపవలన రాజున కొక తనయు డుదయించెను అతడు సారంగధరు డనబడినాడు

రాజరాజ నరేంద్రు డచట నొక నగరమును నిర్మించి, ఆ ప్రాంతమును పాలించుచుండెను సారంగధర చరిత్ర ఈ ప్రాంతమున జరిగినట్లు ప్రజలు భావింతురు

వేములవాడకు చేరువలో నాంపల్లి గ్రామమున్నది ఆ గ్రామమునందొక కొండ యున్నది కొండపై నరసింహ స్వామి ఆలయమున్నది ఇచట చిత్రాంగి కన్నులనబడు రెండు గుంటలున్నవి క్రిందనున్న నొక గుండును సారంగధరుని గుండు అని యందురు ఈ గుండుపై నొక స్త్రీ మూర్తి చెక్కబడి యున్నది రాజరాజ నరేంద్రుడు చిత్రాంగి ప్రవర్తన తెలిసికొని శిక్షింప ఆమె శరమును



రాజేశ్వరాలయపు ప్రధాన ద్వారము



రాజేశ్వరాలయ గోపురము



రాజేశ్వరాలయము —
కోటిలింగములనబడు ద్వాదశ శివలింగములు



శివ పంచాయతము

గుండుకు పగులకొట్టుకొని మరణించెను నృసింహాలయమున్న కొండయం దొక గుహ యున్నది అది లోపల విశాలముగ నున్నది నవనాధులీ గుహలో తపమాచరించి యుండిరని స్థానికులు చెప్పుచుందురు

ఈ పురాణ గాథలు, స్థల పురాణములు, జన శృతిలోనున్న కథలు, అంతగా నమ్మదగినవి కావు వేములవాడ, చాళుక్యుల కాలమున వారి రాజధానిగా వర్ధిల్లిన పట్టణము ఇచటి రాజేశ్వర, ఆదిత్యేశ్వర, నగరేశ్వరాలయములు రెండవ అరికేసరి వేయించిన శాసనమందు పేర్కొనబడినవి కావున ఈ పట్టణము ప్రాచీనమైన దైనను వేములవాడ చాళుక్యులకాలమున మహోన్నత స్థితియందుండెనని భావింపవచ్చును

## రాజేశ్వరాలయము :

వేములవాడ క్షేత్రమునందున్న ప్రధాన దేవాలయము రాజేశ్వరాలయము ఈ ఆలయకుడ్యములపై పౌరాణిక గాథలు, నీతికథలు చిత్రింపబడినవి శైవ, వైష్ణవగాథ లనేకరూపమున కనిపించుచున్నవి ఆలయ ప్రాగ్ద్వారమునకు రెండువైపుల మాతృదేవతాగణ విగ్రహములు, జైనవిగ్రహములున్నవి

వేములవాడ గ్రామమందును, గ్రామము వెలుపలను, దేవాలయములందును అనేక జైన విగ్రహములున్నవి పూర్వమీ ప్రాంతము జైన కేంద్రముగ వర్ధిల్లియుండెను జైనమఠములు, జినాలయములు, తీర్థంకరుల విగ్రహములు, చక్రేశ్వరి విగ్రహములు శైవమత దురహంకారుల మత మౌఢ్యమున కెరయైనవి

వేములవాడ చాళుక్య ప్రభువులలో నధికులు జైన మతానుయాయులు వారు నిర్మించిన జినభవనములు, మందిరములు, విగ్రహములు శిథిలముకాగా వాటిని రాజేశ్వరాలయమున భద్రపరిచినారు

రాజేశ్వరాలయము సువిశాలమైనది స్వామి సన్నిధిలో కూర్చొని అభిషేకము లొనర్చుటకును, ప్రార్థనలు చేయుటకు, పూజాదికములు నిర్వహించుటకు గర్భగుడి అనువుగా నున్నది

రాజేశ్వర స్వామి ఆలయమునకు వామభాగమున లక్ష్మిగణపతి విగ్రహమున్నది ఇది అత్యంత మనోహరమైనది శిల్పకళతో నొప్పారుచున్నది ఇంద్రనీల ఛాయగల ఈ విగ్రహము చూపరుల నాకర్షించుచుండును

గణపతి విగ్రహమునకు చేరువలోనున్న నొక గదియందు రాజేశ్వర స్వామి ఉత్సవ విగ్రహముల నుంచెదరు

గర్భగుడియందున్న రాజరాజేశ్వరస్వామిలింగ మపురూపమైనది. ఈ ఆలయ ద్వారబంధములు అనల్ప శిల్ప సంపదలగలవి ద్వార పాలకుల విగ్రహములు, స్త్రీ మూర్తులు అసాధారణ శిల్పముతో నొప్పారుచున్నవి ద్వారము మధ్యభాగమున గజలక్ష్మి చెక్కబడియున్నది

రాజేశ్వరాలయ ప్రాకార మందనంత పద్మనాభ స్వామి యున్నాడు ద్వా మం దొక నటరాజ విగ్రహమున్నదీ రాజేశ్వరాలయ ద్వార బంధములు శిల్ప సంపద కాలవాలమైనవి

రాజేశ్వర స్వామి లింగము ఇంద్రనీలచ్ఛాయ గలది ముఖ లింగ మహాక్షేత్రమందున్న సోమేశ్వరాలయమందలి లింగమువలె నీ రాజేశ్వర లింగ మపురూపమై, ఆకర్షణీయముగ నున్నది

ధర్మకుండ మందున్న రాజేశ్వర లింగమును రాజరాజనరేంద్రుడు వెలికితీసి ఆలయమున స్వామిని ప్రతిష్ఠించి, ధర్మకుండమునకు సోపానములు నిర్మించి తన భక్తిని ప్రకటించుకొనెను ఈ రాజేశ్వరాలయ దక్షిణ ద్వారము చెంతనున్న వేదికపై రెండు మురళీకృష్ణుని విగ్రహములున్నవి

## శ్రీ రాజరాజేశ్వరీదేవి :

రాజరాజేశ్వరాలయము కుడివైపు రాజరాజేశ్వరీదేవి అమ్మవారి ఆలయమున్నది ఇందు గణపతి, రాజేశ్వరుల విగ్రహములున్నవి అమ్మవారి విగ్రహ మపురూపమైనది ప్రభావలయము కలిగి, అత్యంత సుందరముగా మలచబడిన ఈ విగ్రహము సర్వాభరణములతో నలంకరింతురు

రాజరాజేశ్వరీదేవి భక్తుల కోరికల నీడేర్చు మహిమ గలది చిరుగంటల అలంకార సంపత్తి గల ఈ ఆలయము రాజేశ్వరాలయము నిర్మించిన కాలమునాటిది

ప్రతి సంవత్సరము నవరాత్రులందీ ఆలయము దీపాలంకరణతో, కుంకుమార్చనలతో, వివిధాలంకారములతో శోభిల్లుచుండును సువాసినులు అమ్మవారికి కుంకుమార్చన, లక్ష కుసుమార్చన, లక్షపత్రి పూజలు నిర్వహించుచుందురు పర్వదినములందు రాజేశ్వరస్వామివారికి నిర్వహించు సమస్త పూజలు అమ్మవారికికూడ జరుపుచుందురు

రాజేశ్వర లింగమును రాజరాజ నరేంద్రుడు ప్రతిష్ఠించు నంతలో నవనాథుడను సిద్ధుడీ లింగమును ప్రతిష్ఠించెను రాజు చింతాక్రాంతుడై యుండ రాజేశ్వరస్వామి స్వప్నమున సాక్షాత్కరించి బాల రాజేశ్వర లింగమును ప్రతిష్ఠించుట కాదేశించెను

మొదట బాలరాజేశ్వరస్వామికి పూజాదికములు నిర్వహించిన పిదప, రాజేశ్వరార్చన జరుగునని స్వామి అనుగ్రహించి రాజును సంతృప్తి పరచెను నేటికి వేములవాడలో తొలుత బాల రాజేశ్వరు నర్చించు ఆచార మములులో నున్నది



దక్షిణామూర్తి ఆలయము



గండాదీప స్తంభము



కళ్యాణ మండపము — వెనుభాగము

రాజేశ్వరాలయ ద్వార బంధమున గజలక్ష్మి చెక్కబడియున్నది ఈ ఆలయమున ఎడమ వైపు లక్ష్మీగణపతి విగ్రహము, కుడివైపు రాజరాజేశ్వరీదేవి ప్రతిష్ఠింపబడినారు

మేరు తంత్రమున శ్రీ రాజరాజేశ్వరీమనః అను మంత్రోద్ధారిక యున్నది రాజేశ్వరీ దేవి భక్తులపాలిటి కల్పతరువు కోరిన కోరికల ననుగ్రహించు మహిమాన్విత కాశీవిశాలాక్షి, శ్రీశైల భ్రమరాంబిక, కంచి కామాక్షి, మధుర మీనాక్షి, కొల్హాపురలక్ష్మి, బాసర సరస్వతి, బెజవాడ కనకదుర్గ వంటి అష్టాదశ శక్తి పీఠములవలె వేములవాడ రాజరాజేశ్వరీ పీఠ మత్యంత మహిమాన్వితమైనది శక్తివంతమైనది

## కాశీ విశ్వేశ్వరాలయము :

రాజేశ్వరాలయమునకు వెళ్ళు దారిలో ఎడమ వైపు కాశీ విశ్వేశ్వరాలయమున్నది ఇదియొక మండపము వంటిది ఇచట లేత గులాబీ రంగులోనున్న శివలింగము చూపరుల నాకర్షించును ఈ మంటపమున హనుమంతుని విగ్రహము, గంగాదేవి విగ్రహములున్నవి ఈ మండపమందు ప్రతిష్ఠింప బడియున్న శివలింగము కాశీ విశ్వేశ్వర లింగ మనబడుచున్నది. వేములవాడ దక్షిణ కాశీ యనబడుట కీ శివలింగమే ముఖ్య కారణమైయుండును

ఈ మండపమందున్న స్త్రీ విగ్రహముపై అభిషేక మొనర్చిన, ఆ నీరు ఆ విగ్రహము అంజలి ద్వారా ధారాపాతముగ కాశీ విశ్వేశ్వర లింగముపై బడుచుండును

కాశీ విశ్వేశ్వరాలయమునకు ఉత్తరమున గణపతి విగ్రహమున్నది. దానిపై నొక శాసన మున్నది ఇచట పంచాయతనములు, హనుమద్విగ్రహములున్నవి ఈ విగ్రహముల శిల్ప మత్యంత మనోహరముగ నుండును

కాశీ విశ్వేశ్వరాలయమునకు దక్షిణమున కాలభైరవుని విగ్రహమున్నది రాజేశ్వరాలయము వెనుక నొక లింగము, రెండు విగ్రహములున్నవి దేవాలయమున కుత్తరమున చండికేశ్వర విగ్రహ మున్నది సంతతిగోరు స్త్రీలిచట ప్రాణాచార దీక్షను గైకొందురు ఇచటనున్న నొక గదిలో పార్వతీ యుతుడైన పంచముఖ సదాశివుడున్నాడు ఇందు శివలింగము,దేవీ విగ్రహము,హనుమంతుడు, గణపతి, నాగిని విగ్రహములున్నవి ఇవి సుందరముగ నున్నవి. ఈ శివలింగము కాశీవిశ్వేశ్వర లింగమువలె కనిపించును

విశ్వకర్మ వంశజులగు విశ్వబ్రాహ్మణు లీపంచముఖ శివుని విగ్రహమును విశ్వకర్మ విగ్ర హముగ భావించి పూజించుచుందురు

రాజేశ్వరాలయ ప్రాగ్ద్వారమున కభిముఖముగా నొక దీపస్తంభమున్నది దీని నెక్కుటకు రాతిమెట్లున్నవి పూర్వమీ స్తంభముపై దీపములుంచెడివారు జైన విగ్రహములున్న శివలింగము లిచట నున్నవి నృత్యభంగిమలతో కూడిన విగ్రహము లిచట కనిపించును

ఇచట గల మంటపము కేశఖండన మంటపమనబడుచున్నది ఈ మంటపమం దొక శివ లింగము ప్రతిష్ఠింపబడి యున్నది భక్తులీ మంటపమున తలనీలాలు సమర్పించెడివారు

వల్లుబండ చెంతనున్న స్తంభములకు భక్తులు మ్రొక్కుబడిగా రాజేశ్వరస్వామి కర్పించు కోడెలను కట్టి, కొన్ని నాళ్ళటనుండి, నిర్ణీత సమయమున కోడెలను సమర్పించు చుందురు

## నాగ శిల్పములు

రాజరాజేశ్వరస్వామి ఆలయ ప్రాకారమున కుత్తరముననను, ధర్మకుండము ప్రక్కను అనేక నాగ ప్రతిమలు ప్రతిష్ఠింపబడి యున్నవి నాగులచవితి పండుగ దినమున అసంఖ్యాకులైన భక్తులీ నాగదేవతల నర్చింతురు పాలు పోయుదురు ఇది నాగజాతి సంప్రదాయము - దక్షిణాపథ దక్షిణ భారతములందు నాగపూజ విరివిగను, విధిగను పాటించెడివారు

సింహళము నాగభూమిగా ప్రసిద్ధి గాంచినది నాగవంశపు రాజు లాంధ్రదేశమున వివిధ ప్రాంతములను పాలించినారు. శివుని ఆభరణము నాగము. పౌరుష ప్రతాపములకు నాగజాతి వారు పెట్టినది పేరు నాగపూజ లొనర్చువారిలో ఆంధ్రులు ప్రథమగణ్యులు సంతానము లేనివారు నాగ ప్రతిష్ఠ లొనర్చిన సంతానము బడయుదురని హిందూ మతానుయాయుల నమ్మకము

నాగములు చెక్కిన ప్రతిమలు వేములవాడ పట్టణమున అడుగడుగున కనిపించును నాగ జాతి వారితో ఆంధ్రులకు సన్నిహిత సంబంధములున్నవి కృష్ణానదీ తీరమందున్న అమరావతి ప్రసిద్ధ బౌద్ధ క్షేత్రము ఇచటి బౌద్ధ స్తూపము నొక నాగరాజు నిర్మించియుండెను నాగవంశపు రాజ కుమార్తెను పల్లవ వీర కూర్చవర్మ పరిణయమాడి నాగ రాజ్యమును పొందెను

నాగులతోను, నాగజాతి వారితోను తెలుగు వారికి సన్నిహిత సంబంధములున్నవి నాగుల చవితి, నాగపంచమి పండుగల నతి శ్రద్ధాసక్తులతోను, భక్తి భావముతోను తెలుగువారు జరుపు కొందురు వివాహ కార్యక్రమమున నాగబలి ఒక ప్రధానాంశముగ నుండును నాగజాతికి, నాగులకు సంబంధించిన అనేక పౌరాణిక గాథలు ప్రచారమందున్నవి వేములవాడకు చేరువలో పావన గోదావరీ నదీ తీరమందున్న ధర్మపురి, ధర్మాంగద చరిత్రతో ముడివడియున్నది

వేములవాడలో నిర్వహించిన త్రవ్వకములం దనేక జైన విగ్రహములు, శివలింగములు, నాగములు చెక్కిన శిలలు లభించినవి ఇవి యన్నియు ధర్మకుండము చెంత నిలుపబడినవి ఇవి అందముగను శిల్పకళా శోభితముగను నున్నవి

## మహిషాసురమర్దని :

వేములవాడలోనున్న ధర్మశాలకు చేరువలో మహిషాసురమర్దని విగ్రహమున్నది ఇచట శివ లింగము, గణపతి పతిష్ఠింపబడినవి త్రిపుర సుందరి విగ్రహమువలె మహిషాసురమర్దని విగ్రహము కాంతియుతమై, మహిమాన్వితమైయున్నది ఇచట నున్న సత్రశాల, ధర్మశాలలు యాత్రికులకు వసతి సౌకర్యముల నేర్పరచుటలో నుపయోగపడుచున్నవి

రాజరాజేశ్వరస్వామి మ్రొక్కుబడులకు తేబడు కోడెల నీ సత్రశాల పరిసరములందు నిలుపుదురు రాజేశ్వరాలయ పశ్చిమదిశా భాగమందీ సత్రములు, ధర్మశాలలు నిర్మింపబడియున్నవి

## అనంత పద్మనాభ స్వామి ఆలయము :

అనంత పద్మనాభ స్వామి ఆలయద్వారమున నటరాజ స్వామి విగ్రహము నిలుపబడి యున్నది ఈ ఆలయ ద్వార తోరణములు శిల్పకళల కాలవాలమైయున్నవి భక్తులు, మృదంగాదివాద్య ములతో స్వామిని కొలుచుచున్నట్లున్న శిల్పము ద్వార బంధములపై చెక్కబడినది ఇచటి స్త్రీ విగ్రహ ములు అవయవ పుష్టి కలిగి సహజ సిద్ధముగను, మనోహరముగను కనిపించును

ముఖమండపము, అంతరాళ మండపము, గర్భగుడి గల ఈ అనంత పద్మనాభస్వామి ఆలయము ఏ కాలమం దెవ్వరిచే నిర్మింపబడినదో తెలియదు కాని, స్వామి వారి విగ్రహము, లక్ష్మీదేవి విగ్రహము అత్యంత సౌందర్యముతో విరాజిల్లుచున్నవి ఇది రాజేశ్వరాలయము కన్న ప్రాచీనమైనదని యందురు కాని అది నిజము కాదు రాజేశ్వరాలయ మతి పురాతనమైనది తెలంగాణ ప్రాంతమున 12 వ శతాబ్ది ఉత్తరార్ధమునుండి వైష్ణవ మత వ్యాప్తి ప్రారంభమైనది కాకతి గణపతి దేవ చక్రవర్తి పాలించు నాటివరకు శైవమతము సర్వాతిశాయియై వర్ధిల్లినది తరువాతి కాలమున వైష్ణవాలయముల నిర్మాణము జరిగినది

అనంత పద్మనాభస్వామి ఆలయమున కిరువాకుల వేణుగోపాలస్వామి విగ్రహములున్నవి రాజేశ్వరాలయమునకు పశ్చిమ దిశలో నీ ఆలయము నిర్మింపబడినది

శివకేశవుల కుత్సవములు వేములవాడలో నిర్వహింపబడుటవలన ఇది హరిహర క్షేత్రమని ప్రసిద్ధి గాంచినది

## కోదండరామాలయము .

అనంతపద్మనాభస్వామి ఆలయసమీపమందీ కోదండరామాలయమున్నది ఈ ఆలయమున శ్రీరామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నుల విగ్రహములు, సీతాదేవి విగ్రహములున్నవి ఇవి సహజ శిల్ప సంపదతొ నొప్పారుచున్నవి ఈ ఆలయమున కభిముఖముగా ఆంజనేయ స్వామి విగ్రహమున్నది

## ఉమామహేశ్వరాలయము :

వేములవాడలోనున్న సోమేశ్వరలింగము వెలుపలి భాగమున ఉమ, నంది, హనుమత్, నాగ విగ్రహములున్నవి ఇది ఉమామహేశ్వరాలయ మనబడుచున్నది ఆలయమందున్న నాగము చెక్కిన శిల్ప మత్యద్భుతము భక్తులు ఉమామహేశ్వరులతోపాటు హనుమద్విగ్రహమునకు, నాగశిల్పమునకు అర్చనలు చేయుచుందురు

## బాలాత్రిపుర సుందరీదేవి :

రాజేశ్వరాలయమునకు పశ్చిమమున మంచినీటి బావికి చేరువలోనున్న నాగిరెడ్డి మండపము నంటి బాలాత్రిపురసుందరీదేవి ఆలయమున్నది ఇందు దుర్గాదేవి విగ్రహము జీవకళతో నొప్పారుచు, వివిధ భూషణాలంకారముతో శోభిల్లుచున్నది ఈ ఆలయమును దర్శించు యాత్రికులు భక్తిశ్రద్ధలతో అమ్మవారి నర్చింతురు

## బాల రాజేశ్వరాలయము :

ధర్మకుండము నుండి రాజేశ్వర లింగమును వెలికి దీసి యుంచి, ఆలయమున ప్రతిష్ఠింప దలచిన రాజరాజనరేంద్రుని కన్న ముందుగా నవనాధుడు ప్రతిష్ఠించెను రాజరాజనరేంద్రుడు భిన్నుడై యుండ రాజేశ్వర స్వామి స్వప్నమున కనిపించి, "బాల రాజేశ్వరుని ప్రతిష్ఠింపుము. ముందుగా నీవు ప్రతిష్ఠించిన లింగమునకు పూజ లొనర్చిన పిదపనే రాజేశ్వరున కర్చనలు జరగును" అని తెలిపెను ఈ బాల రాజేశ్వరాలయము సాధారణ శిల్పముతో నొప్పారుచున్నది పాండవ మధ్యముడీ లింగము నర్చించెనని యందురు లింగమును ప్రతిష్ఠించినవాడు రాజరాజనరేంద్రుడు. ఆలయమును నిర్మించిన వారెవ్వరో తెలియదు

## విఠలేశ్వరాలయము :

విఠలేశ్వరాలయమందున్న విఠలేశ్వర, రుక్మిబాయి విగ్రహము లతి మనోహరముగను, సుందరముగను నున్నవి ఇచట నొక గదిలో వీరభద్రుని విగ్రహమున్నది ఈ ఆలయము పైకప్పు రాళ్ళపై శాసనములున్నవి ఇది ప్రాచీన కాలమున నిర్మింపబడినది



బాల రాజేశ్వరాలయము



రాజేశ్వరాలయము - వ్రత పీఠములు



రాజేశ్వర స్వామివారి వాహనములు



కోడెలను నిలుపు స్థలము



కోడెలు

## ద్వాదశ లింగములు :

ఈ లింగములు కోటి లింగములనబడు చున్నవి వీటి మధ్య లింగాకారమున జైన విగ్రహములు చెక్కబడినవి బహుశః జైనమత సంబంధమైన విగ్రహములను, శిలా స్తంభములను శివలింగములుగ మార్చి యుందురు

జైనమతము క్షీణించు కాలమున శైవమతము విజృంభించినది శైవులు జైనమతమును నిరసించి జినభవనములను, జినాలయములను, జైన బసదులను విధ్వంస మొనర్చినారు జైనమతాను యాయు లధిక సంఖ్యలో శైవమత స్వీకార మొనర్చినారు బహుశః జైనమతము శైవమతమున విలీనమైనదనుటకు ప్రత్యక్ష సాక్ష్యాధారములుగ జైన ప్రతిమలు గల శివలింగములు చెక్కింపబడి యుండ వచ్చును కొలనుపాకలో నిట్టి దురంతముల కెరయైన అనేక జైన విగ్రహములు కనిపించును. వేములవాడ జైనమత కేంద్రముగ నుండి కాల క్రమమున శైవ క్షేత్రముగ రూపొందినది

## శివ పంచాయతనములు :

రాజేశ్వరస్వామి ఆలయమునకు పశ్చిమమున నైరుతి, వాయవ్య దిశలయందు మూడు శివ పంచాయతనములున్నవి మూలలందున్న మండపములం దివి ప్రతిష్ఠింపబడినవి శివలింగము, అమ్మ వారి విగ్రహము, ఆంజనేయస్వామి, నంది మున్నగు విగ్రహములిచట నున్నవి దక్షిణ దిశలోనున్న మండపమునం దెనిమిది పంచాయతనములున్నవి ఇందలి విగ్రహములు పరిమాణమున చిన్నవైనను చూచుట కందముగను, ఆకర్షణీయముగను కనిపించును

## సోమేశ్వరాలయము :

వేములవాడలోనుండిన విప్రుడొకడీ సోమేశ్వరాలయమును నిర్మించి శివలింగమును ప్రతిష్టించెను సోమేశ్వరలింగమున్న గది విశాలమైనది ఇది జప తప హోమాదులు నిర్వర్తించుట కనుకూలముగ నున్నది ద్వాదశ జ్యోతిర్లింగములలో సౌరాష్ట్రమందున్న సోమనాథుని లింగము ప్రథమ గణ్యమైనది ఆ జ్యోతిర్లింగము పేర వేములవాడలో ఈ సోమేశ్వర లింగము ప్రతిష్ఠింపబడినది

## భీమేశ్వరాలయము :

వేములవాడలో వెలసిన భీమేశ్వరాలయము పశ్చిమ చాళుక్య శిల్ప సంపద కాలవాలమైనది అధిష్ఠానము, వర్గములు, ఆలయ కుడ్యములు, గర్భగుడి ముఖమండపము, అంతరాళ మండపము, ఎత్తైన శిఖరముగల ఈ ఆలయ మతి ప్రాచీనమైనది ఇందు బృహచ్ఛీమేశ్వరలింగము, ఎత్తైన పానవట్టముతో కూడియున్నది

రెండవ యుద్ధమల్లుని తనయుడగు బద్దిగ డీఆలయమును నిర్మించెను ఇతని పరిపాలనా కాలము క్రీ శ 850-895 ఈ ఆలయ మాతని చివరి పరిపాలనా సంవత్సరము లందు నిర్మింపబడి యుండును

రాజరాజేశ్వర మాహాత్మ్యమున ఈ భీమేశ్వర లింగము త్రేత, ద్వాపర యుగములందు పూజలందుకొని నట్లున్నద

శ్రీ రామ వనవాసకాలమున అతడు లక్ష్మణ సహితుడై వేములవాడ కేతెంచి భీమేశ్వరు నర్చించెనని స్థానికులు చెప్పుచుందురు

కురు వంశీయులగు పాండవు లరణ్యవాస కాలమందీ ప్రాంతమున కేతెంచి భిమేశ్వరుని దర్శించి అభిషేకము లొనర్చి అభీష్టసిద్ధిని పొందినారని యందురు

భీమేశ్వరాలయ మతి సుందరమైనది ఈ ఆలయ కుడ్యములపై పౌరాణిక గాథలు, నీతి కథలు, దశావతార ఘట్టములు, లింగోద్భవము, వివిధములైన పక్షులు చిత్రింపబడినవి

ఆలయ ఆవరణలో నాలుగు శిలా నిర్మిత గజములున్నవి ఇవి అద్భుతమైనవి దేవాలయమున వాత్స్యాయన కామ సూత్రములకు సంబంధించిన చిత్రములున్నవి ఇవి బూతు బొమ్మలు

భీమేశ్వరాలయమున కుత్తరమున నటరాజ విగ్రహమున్నది ఇది కొంత శిథిల రూపమున కనిపించుచున్నది అసాధారణ శిల్ప సంపదతో నొప్పారు ఈ దేవాలయము బద్దెగ మహారాజు శిల్ప కళాభిమానమును వెల్లడించుచున్నది

భీమేశ్వరాలయ ఆవరణమందున్న అశ్వత్థ వృక్షము చెంత వీరాంజనేయ స్వామి విగ్రహమున్నది ఇచట నొక వేదిక నిర్మింపబడినది

ఈ వేదిక వేసవిలో చల్లగను, శీతాకాలమున వెచ్చగను ఉండును ఛాత్రులకు అధ్యాపకు లకీ వేదిక ఉపయుక్తమైనది పూర్వమీ వేదిక అధ్యయన, అధ్యాపనముల కుపయోగపడుచుండెను ఇచట నంది, గణపతి విగ్రహములు ప్రతిష్ఠింపబడినవి

భీమేశ్వరలింగము వేములవాడ భీమేశ్వరస్వామిగా ప్రసిద్ధము ఈ లింగము నల్లసంపు రాతితో మలచబడినది ఎత్తైన ఈ లింగము గంభీరముగ కనిపించును ప్రశాంత వాతావరణము నెలకొనియున్న ఈ ఆలయము భక్తుల పాలిటి కల్పతరువు నిత్య పూజలు, నిత్యాభిషేకములు, రుద్రాభిషేకములు, ఏకాదశ రుద్రాభిషేకములీ స్వామికి జరుగుచుండును శివరాత్రినాడీ ఆలయము దీపములతో నలంకరింపబడును. మహాన్యాసపూర్వక రుద్రాభిషేకము లనుదినమిచట జరగుచుండును.



బీమేశ్వరాలయ గర్బగుడి – పూజారి



బీమేశ్వరాలయ గోపురము



బీమేశ్వరాలయమందలి సప్త మాతృకలు

భీమేశ్వరాలయము – చతుర్ముఖుడు



భీమేశ్వరాలయము – ఆంజనేయస్వామి





భీమేశ్వరాలయము – శివుని విగ్రహము

ఎల్లమ్మగుడి ఆవరణలోనున్న విగ్రహములు





ఎల్లమ్మ దేవత





బది పోచమ్మ గర్భగుడి



బది పోచమ్మ అమ్మవారు



బద్ది పోచమ్మగుడి

భీమేశ్వరాలయ ఆవరణమందొక వటవృక్షమున్నది వట సావిత్రి వ్రతమొనర్చువారీ వృక్షమును పూజింతురు వేముల వాడలో వటవృక్ష వ్రతమీ వృక్షము చెరీంత నిర్వహింపబడును

వేములవాడ భీమకవి ఈ పట్టణవాసి యనియు, భీమేశ్వరారాధకుడని యందురు కొందరు ద్రాక్షారామ భీమేశ్వరము వేములవాడ భీమకవి జన్మస్థలమని భావించినారు భీమకవి వశ్యవాక్కు కలవాడు

## బద్దిపోచమ్మ గుడి (శీతలాదేవి ఆలయము) :

వేములవాడ చాళుక్య రాజులలో బద్దిగడను రాజు నిర్మించిన ఆలయమిది ఆదిత్య గృహమిదియే యని యందురు తొలుత నిది ఆదిత్యాలయముగ నుండ క్రీ శ 10, 11 శతాబ్దులలో శక్త్యాలయముగ రూపొందినది శాక్తేయ మత ప్రాబల్యము వలన సూర్య దేవాలయము శక్త్యాలయముగ మార్చబడి కాలక్రమమున పోచమ్మ ఆలయముగ పిలువబడినది

ఈ బద్దిపోచమ్మ ఆలయమున కధిక సంఖ్యలో భక్తులు వచ్చుచుందురు. ఇచట శీతలాదేవి సుముఖిగా నారాధింపబడు చున్నది. బద్దిపోచమ్మ గుడిగా నీ ఆలయము ప్రసిద్ధి గాంచినది ప్రజలు వేల సంఖ్యలో వచ్చి తమ మ్రొక్కుబడులను చెల్లించుచుందురు

ఈ ఆలయమందున్న అమ్మవారి విగ్రహ [illegible] నుండి చూపరుల నాకర్షించును.

బద్ది పోచమ్మదేవత శక్తి సమన్విత మ్రొక్కులు చెల్లించనివారి నాగ్రహించునని ప్రజల నమ్మకము శుభకార్యము లారంభించుటకుముందీ అమ్మవారి నారాధించు ఆచారమిచట కలదు

కలరా, అమ్మవారు, తట్టుతల్లివంటి రోగములు వ్యాపించినపుడు బద్దిపోచమ్మ అమ్మవారికి ప్రత్యేకమైన అర్చనలు చేయుదురు ప్రతి సంవత్సరము మాఘ బహుళ అమావాస్యకీ ఆలయమున ఉత్సవములు నిర్వహింతురు

క్రీ పూ 1953కి పూర్వ మీ ఆలయము ముందు వేల సంఖ్యలో కోళ్ళను, గొఱ్ఱెలను బలి యిచ్చుచుండిరి ఆ సమయమున రుధిరధారలు ప్రవహించెడివి. జంతువుల తలలు, మొండెములు రాసులుగా పడియుండెడివి

ఈ ఆలయమున ధూప స్తంభము, యూప స్తంభములున్నవి. యూప స్తంభమునే బలిపీఠము లేక బలివేదిక యందురు. ఇది బలిపూజా విధాన చిహ్నముగ నున్నది. మరికొన్ని శక్తి విగ్రహము లిచట నున్నవి శాక్తేయ మతము వేములవాడ ప్రాంతమున వ్యాపించియుండె ననుటకీ దేవాలయము తార్కాణము

## నగరేశ్వరాలయము :

వేములవాడలో నున్న అతి ప్రాచీనాలయములలో నగరేశ్వరాలయ మొకటి ఈ ఆలయ ప్రశంస రెండవ అరికేసరి వేములవాడ శాసనమందున్నది

నగరేశ్వరము నకరేశ్వరముగ పిలువబడుచున్నది ప్రాచీన కాలమందు వర్తక వ్యాపార మొనర్చువారు, నకరముల నేర్పరచుకొనెడివారు. నకరమన వ్యాపార సంఘము దేశ విదేశములతో వ్యాపార మొనర్చు వర్తకులు తమ వ్యాపారాభివృద్ధికి, వర్తకులలో నేర్పడు అభిప్రాయ భేదములను తొలగించుటకు, వాద వివాదముల పరిష్కారమునకు నకరములను లేక వర్తక సంఘములను స్థాపించు కొనెడివారు

వర్తక సంఘములో సభ్యత్వము పొందిన వ్యాపారులా సంఘమునకు కొంత ధనము నీయ వలసియుండెను అట్లు ప్రోగైన ద్రవ్యము ధర్మ కార్యములకు వ్యయమగుచుండెను వేములవాడలో నున్న నకరము వారు నకరేశ్వరాలయమును తమ సంఘము పేర నిర్మించియుందురు

నల్లగొండ మండలమందున్న పేరూరు వ్యాపార కేంద్రము ఇచట నున్న సోమేశ్వరాలయ మతి ప్రసిద్ధము ఈ పేరూరు పూర్వము ఓడరేవు పట్టణముగా నుండెడిది ఇచట స్వరాష్ట్ర పార రాష్ట్రిక, దేశ, విదేశవర్తకులు నివసించుచుండిరి పెరూరులో నున్న అరవ నకరము, తెలుగు నకరమువా రచట నున్న ఆలయముల నిర్వహణా బాధ్యత వహించి యుండిరి.

అట్లే వేములవాడలో నున్న వర్తక వ్యాపారులు తమ నకరము మూల ద్రవ్యము వెచ్చించి నకరేశ్వ రాలయమును నిర్మించి యుందురు నకరేశ్వ రాలయము కాలక్రమమున నగరేశ్వరాలయముగ పిలువబడుచు వచ్చినది

నకరేశ్వ రాలయము పైకప్పును రాజహంసలు మోయుచున్నట్లున్న శిల్ప మతి మనోహర ముగ నున్నది ఈ ఆలయ కుడ్యములపై నిట్టి శిల్పమున్నది ఈ ఆలయము, ముఖ మండపము, కల్యాణ మండపము, గర్భగుడి కలిగియున్నది ఆలయము మధ్యభాగము సువిశాలముగ నున్నది అందు దేవీ విగ్రహము గణపతి విగ్రహము లున్నవి ఇచట నంది, మువ్వలు, పట్టెడలు, గజ్జెలు, హారములు తదితర ఆభరణములు కలిగి శిల్పకళతో నొప్పారుచున్నది

గర్భాలయము విశాలముగ నుండి 15 మంది భక్తులు కూర్చొని నగరేశ్వరుని కభిషేక మొనర్చుట కనుకూలముగ నున్నది నగరేశ్వర లింగ మతి పురాతనమైన దైనను, చూచుట కందముగ నున్నది వేములవాడ, తదితర గ్రామములందుండు వైశ్యు లీనగరేశ్వరుని భక్తి ప్రపత్తులతో నర్చింతురు ఈ ఆలయ ముద్ధరింపబడినది ఆధునిక సౌకర్యముల కాలవాలమైనది

## వేణుగోపాలస్వామి ఆలయము :

కేదారేశ్వరాలయమున కెగువభాగమునందున్న ఆలయమిది ఇందు గర్భాలయము, కల్యాణ మంటపములున్నవి ఆలయావరణమందొక మండపమున్నది ఈ మండపమున హోమములు జరుప బడును కల్యాణమండపమున స్వామివారి కల్యాణము ప్రతి సంవత్సరము నిర్వహింపబడును ఈ ఆలయ కుడ్యములందు జైన బౌద్ధ విగ్రహము లమర్చబడినవి

వేములవాడ ప్రాచీన కాలమున జైన బౌద్ధమతములకు కేంద్ర స్థానముగ నుండెను చాళుక్యులు జైన మతానుయాయులు వారి పరిపాలనా కాలమున జైన మఠములు, జిన భవనములు, జినాలయములు నిర్మింపబడినవి అనేక తీర్థంకరుల విగ్రహములు ప్రతిష్ఠింపబడినవి కాలక్రమమున జైన బౌద్ధమతములు క్షీణించినవి. జినాలయములు, బౌద్ధమత సంబంధ ఆరామవిహారములు, చైత్యాలయములు పడగొట్టబడినవి శిథిలాలయములందలి విగ్రహములు, స్తంభములు శివాలయముల నిర్మాణమందుపయోగింపబడినవి వేణుగోపాలస్వామి దేవాలయ కుడ్యముల నిర్మాణమందట్టి జైన, బౌద్ధ ఆలయముల శిథిలావశేషము లుపయోగింపబడినవి

వేణుగోపాలస్వామి ఆలయ ముఖద్వారమునకు రెండు ప్రక్కల సింహముల శిల్పములున్నవి ఇచట ద్వారపాలకుల విగ్రహములు, స్త్రీ విగ్రహములు నిలువబడినవి నాట్య విన్యాసముతో నొప్పారు ఈ విగ్రహములు శిల్ప సౌందర్య విరాజితములు

శ్రీ వేణుగోపాలస్వామి విగ్రహ మపురూపమైనది ముఖ వర్చస్సు అనుపమానమై దరహాస చంద్రికలను వెదజల్లుచున్నట్లుండును స్వామి వారి విగ్రహముకన్న రుక్మిణీదేవి విగ్రహము చిన్నదిగాను అందమైనదిగాను నున్నది శ్రీకృష్ణ జన్మాష్టమి, తదితర పర్వదినములందీ ఆలయమును దర్శించుటకు వేల సంఖ్యలో భక్తులు వచ్చుచుందురు స్వామి వారికి నిత్యారాధనములు, నిత్య పూజలు, ధూపదీప నైవేద్యాదులు క్రమము తప్పక నిర్వహింపబడుచుండును హరిహరా భేదమును పాటించు భక్తులీ హరిహర క్షేత్రమును గాంచి తరించుచుందురు

## కేదారేశ్వరాలయము :

వేములవాడ చాళుక్య వంశమునకు చెందిన రెండవ అరికేసరి శాసమున కేదారేశ్వరాలయ ప్రశంస యున్నది ఈ ఆలయ శిల్ప మనుపమానము దేవాలయ కుడ్యము లపురూప శిల్ప సంపదతో నొప్పారుచున్నవి ఈ శిల్పమందలి స్త్రీల నృత్యభంగిమలు చూపరుల నాకర్షించును. స్త్రీల నృత్య భంగిమలతోపాటు అనేక గజములు చిత్రింపబడినవి.

కేదారేశ్వరాలయ దక్షిణ కుడ్యముపై గణపతి విగ్రహమున్నది ఇది అలంకరింపబడి యున్నది పాదభూషణములతోను, కరకంకణ భూషణములతోను అనేక కంఠాభరణములతోను, నాగ ఉదరబంధముతోను, దేదీప్యమానముగ ప్రకాశించు ఈ గజాననుని విగ్రహము జీవకళ ఉట్టిపడు చున్నట్లు కనిపించును కుడ్యోపరిభాగమున క్షీరసాగర మథనమును సూచించు శిల్పమున్నది

పంచతంత్రమందలి హంస తాబేలు కథ, గండభేరుండ పక్షులు, సింహములు, దశావ తారములు, నీతి కథలు, పౌరాణిక, పౌరాణికేతర గాథలు, వివిధ నృత్య భంగిమలీ ఆలయ శిల్ప మున గోచరించును.

కేదారేశ్వరాలయ ఉత్తర భాగమున వీణను మీటుచున్నట్లున్న సరస్వతీదేవి విగ్రహమున్నది. గర్భాలయము ముందు మువ్వల వరుసలు, పట్టెడలున్న నంది విగ్రహము శిల్పకళతో నొప్పారు చున్నది నందీశ్వరునికి కుడి భాగమున దేవీ విగ్రహము, ఎడమ వైపు గణపతి, మహానాగము, మహిషాసురమర్దని విగ్రహములున్నవి కేదారేశ్వర లింగము గంభీరముగ కనిపించును

కేదారేశ్వరాలయము ముందొక జైన విగ్రహమున్నది కేదారేశ్వరుడు మానవజాతి నుద్ధరించు మహిమాన్వితుడు ఈ ఆలయ కుడ్యము నందు విష్ణుమూర్తి విగ్రహము నిలుపబడినది ఈ ఆలయ మందున్న దేవతా విగ్రహములు, అశ్వగజ సమూహములున్న శిల్పములు ఆనాటి యుద్ధ వ్యూహ రచన మును వెల్లడించును

కేదారేశ్వరాలయ కుడ్యములపై ధర్మ చక్రములు చెక్కబడినవి ఈ ఆలయమున శివరాత్రి మహోత్సవము లతి వైభవముగ నిర్వహింపబడును ప్రతి దినము త్రికాలములందు పూజలు అభిషేక ములు క్రమము తప్పక జరుగుచుండును

## కనకదుర్గ, మహాలక్ష్మి ఆలయములు :

వేములవాడ గ్రామము వెలుపల తూర్పుదిశలో కనకదుర్గ, మహాలక్ష్మి ఆలయములున్నవి. ఇవి సాధారణ శిల్పముతో కూడియున్నవి

మహాలక్ష్మి ఆలయ మతి విశాలమైనది ముఖ మండపము, గర్భాలయములున్న ఈ ఆలయ మున మహాలక్ష్మి విగ్రహము ప్రతిష్ఠింపబడియున్నది. ఇది గొప్ప విగ్రహము

ప్రతి సంవత్సరము శ్రావణ మాసమున శుక్రవారములందు వేములవాడ తదితర గ్రామము లందున్న బ్రాహ్మణులు, బ్రాహ్మణేతరులు మేళతాళములతో లక్ష్మిదేవి ఆలయమునకు వచ్చుచుందురు వారు పుట్నాలు, బెల్లము, కొబ్బరికాయలు తెచ్చి అమ్మవారి పూజాదికములు నిర్వహించి నైవేద్యముగా సమర్పింతురు



కేదారేశ్వరాలయము



కేదారేశ్వరుడు



దర్మకుండము చెంతనున్న శివలింగము



భీమేశ్వరాలయము – నవగ్రహ మంటపము



నందీశ్వరుడు



నగరేశ్వరాలయ సింహద్వారము



నగరేశ్వరాలయ గర్భగుడి

స్త్రీ పురుషులు లక్ష్మీదేవికి వడిబియ్యము పోసిన పిదప దేవీ ప్రసాదమును కుంకుమాక్షతలతో కలిపి ఒకరికొకరిచ్చుకొందురు ఇట్లు ఒకరినొకరు కుంకుమాక్షతలతో సంభావించుకొనుట వారి వారికి గల ఆత్మీయత, ప్రేమానురాగములు వెల్లడించుకొనుటగా భావింతురు

మహాలక్ష్మి దేవాలయము చెంత కనకదుర్గాలయమున్నది ఇచట కనకదుర్గ, పెద్దమ్మ విగ్రహములు విడివిడి గదులయందు ప్రతిష్ఠింపబడినవి

క్రీ శ 1958 వరకీ ఆలయములందు జంతుబలు లుండెడివి నేడట్టి జంతుబలి నిషేధింపబడినది కొబ్బరి కాయలు, గుమ్మడి కాయలు కొట్టు ఆచార మవలంబించు చున్నారు

మహాలక్ష్మి ఆలయమున జరుపు శ్రావణ శుక్రవారపు పూజలు కనక దుర్గాలయ మందును జరుగు చుండును పెద్దమ్మ విగ్రహమునకు సైతం మీ కాలమున పూజలు నిర్వహింపబడును

ఈ జంట దేవాలయముల శిల్పమల్పమైనదైనను ఆలయములందు ప్రతిష్టింపబడిన లక్ష్మీదేవి, కనకదుర్గ, పెద్దమ్మ దేవతలు శక్తి సమన్వితలు, కావున వేములవాడ ప్రాంత ప్రజ లతి శ్రద్ధాసక్తులతోను భక్తిప్రపత్తులతోను ఈ శక్తిత్రయమును పూజింతురు

## నాగిరెడ్డి మండపము :

రాజేశ్వరాలయ మండపమును నాగిరెడ్డి మండపమందురు నాగిరెడ్డి వేములవాడ ప్రాంతమున నివసించు భూస్వామి అతడు శివాంఘ్రి పూజా తత్పరుడు అనుదినము శివు నారాధించువాడు మహాన్యాస పూర్వక రుద్రాభిషేక మొనర్చు భక్తుడు

నాగిరెడ్డి అతిథి అభ్యాగతుల నాదరించి అన్నమిడువాడు ఒక మండలము కాలము రాజేశ్వర స్వామిని భక్తి పారవశ్యమున అర్చించి బ్రాహ్మణులకు సంతర్పణము చేసి మండప నిర్మాణము గావించెను వేదవిదులైన విప్రులకు అనేక దానము లొసంగెను ఒక కోనేరును త్రవ్వించి, మామిడి తోటను బ్రాహ్మణులకు దానమిచ్చెను

ఒక పర్యాయము నాగిరెడ్డి, ఎనిమిది చూత ఫలములను బ్రాహ్మణులకిచ్చి, వాటి రసముతో రాజేశ్వర స్వామి కభిషేక మొనర్చుడని తెలిపెను ఆ విప్రులలో నిద్దరు చెరి రెండు ఫలములను స్వంతమునకు వాడుకొనిరి తక్కిన నాల్గు ఫలముల రసమును రాజేశ్వరస్వామి అభిషేకమున కుపయోగించిరి

రాజేశ్వరస్వామి ఆనాటి రాత్రి నాగిరెడ్డికి స్వప్నమున సాక్షాత్కరించి "నీవు అభిషేకముకై విప్రుల కొసంగిన ఫలములలో నాలుగు మాత్రమే నాకు చేరిన"వని తెలిపెను

నాగిరెడ్డి, ఉదయము మేల్కాంచి, విప్రులను పిలిపించి వారికి తన స్వప్న వృత్తాంతమును వినిపించి, పండ్లను స్వంతమునకు వాడుకొనిన ఇరువురు బ్రాహ్మణులను దండించెను

విప్రులు జిహ్వాచాపల్యమున చూతఫలముల నారగించి యుండవచ్చును కాని వారిని దండించి గొప్ప పాపమును మూటగట్టుకొనినాడనని నాగిరెడ్డి భావించి మరికొన్ని ఫలములను స్వామి అభిషేకార్థము బ్రాహ్మణుల కొసంగెను వారీ పర్యాయము నాగిరెడ్డి ఇచ్చిన ఫలము లన్నిటిని స్వామి వారి అభిషేకమునకు వినియోగించిరి

రాజేశ్వరస్వామి సంతసించి నాగిరెడ్డికి స్వప్నమం దగుపడి మామిడిపండ్లు తన కందిన వని తెలిపెను.

నాగిరెడ్డి, బ్రాహ్మణులను దండించినందులకు చింతించి వారిని తన తప్పిదమును సైరింపు డని కోరి దీక్షాకంకణుడై రాజేశ్వరాలయ మండపమును నిర్మించెను అచట నొక కోనేరును త్రవ్వించి, మామిడితోట నొక దానిని విప్రులకు దానమిచ్చెను ఈ మండప నిర్మాణము వలన నాగిరెడ్డి చరితార్థు డయ్యెను.

## నౌబత్ ఖానా :

వేములవాడలోని రాజేశ్వరాలయ సింహద్వారమున కభిముఖముగా నౌబత్ఖానా యుండెడిది. స్వామివారి కిచటనుండి ఉదయము మధ్యాహ్నము సాయంకాలములందు నౌబతులు మ్రోగించుచుండిరి ఇది రాజలాంఛనము వరంగల్ జిల్లాలోనున్న జీడికల్లు రామాలయము ముందు భాగమున గల రెండంత స్థుల మేడలో నౌబతులు మ్రోగించు సాధనములున్నవి ప్రతి దినము ఉదయ, మధ్యాహ్న, సాయం వేళలం దిచట నగారాలు మ్రోగింతురు

వేముల వాడలోనున్న నౌబతుఖానా శిథిలమైయుండ, దోమకొండ సంస్థానాధీశుడు దానిని బాగుచేయించి యుండెను

ఈ నౌబతులు మ్రోగించు పద్ధతి మహమ్మదీయుల పరిపాలనా కాలమునం దధికముగా నుండెను గౌరవసూచకముగా నిట్టి నౌబతులు మ్రోగింపబడును

వేములవాడ రాజరాజేశ్వర స్వామివారి కనుదినము పూజా సమయములందు వాద్యములు మ్రోగించు ఆచార మిప్పటికిని కలదు

## కల్యాణ మండపము :

ఈ మండప మతి ప్రాచీనమైనది శైవ, వైష్ణవ మతములకు సంబంధించిన ఉత్సవములు పార్వతీ పరమేశ్వరుల, రుక్మిణీ వేణుగోపాలుర కల్యాణము లీ మండపమున జరుపబడును.

వేములవాడలో ఈ కల్యాణ మండపమున కన్ని ఉత్సవ విగ్రహములు కొనిరాబడును ఆయా ఉత్సవములం దీ కల్యాణ మండపము, పురాణ, హరికథ, సంగీత సాహిత్య సమావేశములకు వేదికగా నుండును

శైవులకు, జైనులకు, వైష్ణవులకు, శైవులకు సంభవించిన మత యుద్ధముల తరువాత ఈ వేములవాడ హరిహర క్షేత్రముగ రూపొందినది

వేములవాడలో జరుగు అన్ని ఉత్సవములందు కల్యాణ మండపమున నృత్య, సంగీత కార్యక్రమములు నిర్వహింపబడును వివిధ ప్రాంతములనుండి పండితులు, కవులు, శాస్త్రజ్ఞులు, సమస్త శాస్త్రములందు నిష్ణాతులైన మహనీయులు వేములవాడ కేతెంచి కల్యాణమండపమున తమ ప్రజ్ఞాపాటవములను ప్రదర్శించి ప్రజల నానందింపజేయుదురు

## గండదీప స్తంభము :

రాజేశ్వరస్వామి భక్తులు తమ మ్రొక్కుబడులు చెల్లించుటకు వేములవాడకు సంవత్సరమంతయు వచ్చుచుందురు కొందరు గండాదీపములు వెలిగింతురు ఈ గండాదీప స్తంభము అనంత పద్మనాభస్వామి ఆలయము ముందున్నది ఈ స్తంభమా ఆలయ ధ్వజస్తంభమై యుండును నేడు దీప స్తంభముగా నుపయోగింపబడుచున్నది

అనారోగ్య పీడితులు, సంతాన హీనులు, గ్రహచారము చాలనివారు రాజేశ్వరస్వామికి గండాదీపము నెత్తింతుమని మ్రొక్కుకొందురు కార్యము సఫలమైన పిదప, వ్యాధిగ్రస్థులు బాగైన తరువాత, సంతానహీనులు సంతానము కలిగిన పిదప తమ మ్రొక్కులు చెల్లించుకొనుటకు వేములవాడ కేతెంచి ఆలయములం దర్చనలు జరిపి గండాదీపమును వెలిగింతురు ఇది అనాదిగా జరుపబడుచున్న ఆచారము

## వల్లుబండ :

రాజేశ్వర క్షేత్రమందున్న వల్లుబండకు సంబంధించిన ఒక గాధ ప్రచారములో నున్నది. ముస్లిం మతోన్మాదుడైన నొక పీరుడు రాజేశ్వరాలయమును, ఆలయ మందున్న విగ్రహములను, శివలింగములను విధ్వంస మొనర్చుట కొక శార్దూలమును వాహనముగా చేసికొని వేములవాడకు వచ్చెను

మతావేశమున కన్నుమిన్ను గానక ఆలయమందున్న నంది విగ్రహము కొమ్ములను, అమ్మవారి నాసికను విరుగగొట్టి, రాజేశ్వరాలయమును పడగొట్టుటకును, ఆలయమందున్న లింగమును విరుగగొట్టుటకును సమాయత్తుడై యుండ, రాజేశ్వరస్వామి అగ్నివర్షము గురిపించి అతనిని సంహరించెను

ముస్లిం వీరుని శవమును, అతడెక్కి వచ్చిన పులి కళేబరమును స్వామివారు, రాజేశ్వరాలయ ప్రాగ్ద్వారాభిముఖముగా నొక ప్రదేశమున పూడ్పించెను అచట నొక గుండ్రని గుండుంచబడెను అది వల్లుబండ యని స్థానికులచే పిలువబడుచున్నది

రాజేశ్వరాలయ ఆవరణమం దొక చిన్న దర్గా యున్నది అది ఈ ముస్లిం నాయకునిదై యుండునని ప్రజలు భావింతురు

రాజేశ్వరాలయమునం దిట్టి విధ్వంసకాండ యొనర్చినవాడు మొగలు చక్రవర్తి ఔరంగజేబు అనుచరుడై యుండును హిందువులు, మహమ్మదీయులు తరచు యుద్ధము లొనర్చుచు, ఒకరి మత సంస్థల నింకొకరు ధ్వంస మొనర్చుకొనుచు, సామాన్య ప్రజల ధన, మాన, ప్రాణములకు హాని కలిగించు స్థితికి చేరుటవలన, ఉభయమతముల వారు రాజేశ్వరాలయ ప్రాంగణమందున్న చిన్న దర్గా నిర్మాణమున కొప్పందము కుదుర్చుకొని యుందురు

యాత్రికులు, భక్తులు వేములవాడ కేతెంచి, ధర్మకుండమున స్నానమాచరించి, పవిత్ర హృదయముతో వల్లుబండ కడ కేతెంచి, దానిని స్పృశించి తమ కోర్కెలు నెరవేరునో లేదో యని భావించి, బాలరాజేశ్వరుని దర్శించి, పూజించి, రాజరాజేశ్వరుని కభిషేకము లొనర్తురు. కోరిన కోరికలను తీర్చు రాజరాజేశ్వరస్వామి నసంఖ్యాకులైన భక్తు లారాధింతురు

## ధర్మకుండము :

వేములవాడ, రాజేశ్వరాలయమువలన ప్రసిద్ధిగాంచినది ఈ ఆలయమొక బృహత్తటాకము అంచున ఎత్తైన ప్రదేశమున నిర్మింపబడినది ఈ ఆలయమునంటి యొక కోనేరున్నది అది ధర్మకుండ మనబడుచున్నది

ఈ ధర్మకుండ ప్రశంస పురాణములందును, స్థల మాహాత్మ్యమందును కనిపించుచున్నది ఈ ధర్మకుండ మతిపావనమైనదిగను, పాపమును హరించునదిగను వర్ణింపబడినది ద్వాదశ జ్యోతిర్లింగ క్షేత్రములకన్నను, పంచారామములకన్నను, త్రిలింగ క్షేత్రములకన్నను, ఆయా ప్రాంతములందున్న తీర్థములకన్నను నిది గొప్పదని భావింపబడినది



తటాకము



దర్మకుండ మార్గము



ఈ ధర్మకుండమున తీర్థమాడిన భూత, ప్రేత, పిశాచాది గ్రహబాధలు,చర్మవ్యాధులు,పాపము నివృత్తియగునని ప్రజలు భావింతురు రాజరాజేశ్వరస్వామి నిత్యపూజలకు, అభిషేకములకు ధర్మకుండము నీటి నుపయోగింతురు. వేములవాడలోని ధర్మకుండ మతిప్రాచీనమైనది. రాజరాజ నరేంద్రుడీ కుండమునకు సోపానములు నిర్మించినట్లు పురాణములు తెలుపుచున్నవి దీని చుట్టు పంచలింగము లున్నవి గుండమునందు రెండు మంటపములు నిర్మింపబడినవి ఈ ధర్మకుండము నావరించి నొక బృహత్తటాకమున్నది

ఈ ధర్మకుండమునం దనేక జైన విగ్రహములున్నవి జైనమతము వర్ధిల్లి యున్న కాల మందీ ప్రాంతమునం దసంఖ్యాకమైన జినాలయములు, జైన బసదులు, జినభవనము లుండియుండును కాల క్రమమున వేములవాడ శైవ క్షేత్రముగ రూపుదిద్దుకొనినది జైన విగ్రహముల రూపు రేఖలు మారిపోయినవి జినాలయములు ధ్వంసము గావింపబడినవి

వేములవాడ చాళుక్యులు పాలించిన కాలమందీ ప్రాంతము జైనమత కేంద్రముగ వర్ధిల్లి యుండెను అనేక బసదులు నిర్మింపబడి యుండెను

శైవ మతము విజృంభించు కాలమున జైన విగ్రహములు రూపమును కోల్పోయి స్థాన భ్రంశము చెంది ధర్మకుండము నాశ్రయించినవి

ఈ ధర్మకుండము పైభాగమునం దనేక నాగప్రతిమలు చెక్కిన శిలలున్నవి నేడీ ధర్మకుండము నాధునికముగా తీర్చి దిద్దినారు భక్తులకు యాత్రికులకు సమస్త సౌకర్యము లేర్పరచిన దేవాలయ నిర్వాహకులీ ధర్మకుండమునకు సోపానములు నిర్మించినారు ఈ ధర్మకుండమున వేలకొలది భక్తులు స్నాన మాచరించి తమ జీవితములు ధన్యమైనవని భావింతురు.

## వేములవాడలో నిర్వహింపబడు ఉత్సవములు :

వేముల వాడలోనున్న ఆలయములలో రాజరాజేశ్వరస్వామి ఆలయము ప్రధానమైనది ఈ ఆలయమున స్వామివారికి విధి విధానమున వివిధార్చనలు, సేవలు, పూజాదికములు, అభిషేకములు జరుగుచుండును

సంవత్సరమంతయు రాజేశ్వర స్వామి ఉత్సవములు నిర్వహింపబడుచుండును వేములవాడ రాజేశ్వరస్వామి పేదల దేవుడు స్వామిని దర్శించి పూజ లొనర్చువారిలో నూటికి తొంబదిమంది బీద ప్రజలే కావుననే ఈ స్వామి బీద ప్రజల దేవుడని పిలువబడుచున్నాడు

సాధారణ ప్రజలు నిర్వహించు పూజలు, ఉత్సవములు, సేవలు, అభిషేకములే కాక దేవస్థానము వారు కొన్ని ప్రత్యేకమైన ఉత్సవము లివట నిర్వహించుచుందురు మహారాజ భోగము లన్నింటిని స్వామివారు పొందునట్లిచటి దేవాలయాధికారులు కార్యక్రమములు రూపొందింతురు

ఈ ఆలయమున ప్రతియామమున మంగళవాద్యములు, తూర్యారావములు స్వామివారికి శ్రవణపేయముగ నుండునట్లు ప్రయోగింతురు

ఉదయ మధ్యాహ్న సాయంకాలములందును, నిశీధిలోను రాజేశ్వర స్వామికి రాజలాంఛనములతో పూజాదికములు నిర్వహింతురు ప్రత్యేక ఉత్సవములందును, పర్వదినములందును, భక్తుల మొక్కుబడులు చెల్లించు సమయములందును వృషభ, గజ, తురగ, హంస, గరుడ వాహనములపై స్వామివారి నూరేగింతురు మంగళవాద్యములు, భేరులు ప్రయోగించుచు స్వామి ఊరేగింపును వైభవముగా జరుపుదురు

ధ్వజపతాక తోరణమాల్యాదులు, దండాయుధులు, భటులు, వేదమంత్రముల నాలాపించుచు, హరిహరులను స్తుతించుచు బ్రాహ్మణులు, భజనపరులు, చామరమును వీచు దేవదాసీలు వెంటరాగా, ఇరుపార్శ్వముల దివిటీలువట్టి రాజేశ్వరస్వామి నూరేగింతురు ఈ ఊరేగింపు ఉత్సవమతి రమ్యముగను వైభవోపేతముగను నుండును

వేములవాడలో రాజేశ్వరస్వామి, బద్దిగేశ్వర, నగరేశ్వర, భీమేశ్వరాదిదేవతల ఉత్సవములు భారతీయ సంస్కృతిని, వైదికాచార సంప్రదాయములను, తెలుగువారి దైవభక్తిని, సంస్కృతీ సభ్యతలను, భక్తిభావమును చాటునట్లుండును వేములవాడలో ప్రతిదినమేదేని నొక ఉత్సవము నిర్వహింపబడుచుండును

## 1. ఉగాది :

తెలుగు వారికి ఉగాది ముఖ్యమైన తొలి పండుగ వేములవాడలో ఉగాది నాటి ఉదయము హరిహరులకు తైలాభ్యంగన స్నానములు చేయించి పూజాదికములు నిర్వహింతురు నింబకుసుమాదులతో సిద్ధపరచిన ప్రసాదమును నైవేద్యముగా సమర్పింతురు పంచాంగమును స్వామివారికి తదితర దేవతలకు వినిపింతురు ప్రజలు పంచాంగ శ్రవణానంతరము సంవత్సర ఫలితములను తెలిసి కొందురు. ఉగాది పర్వదినమున వేములవాడలో నున్న ప్రజలు రాజేశ్వరాలయమున కేతెంచి పూజలు అభిషేకములు నిర్వహించి పంచాంగ శ్రవణానంతరము ఒకరికొకరు నూతన సంవత్సర శుభాకాంక్షలను తెలియజేసికొందురు.

## 2. శ్రీరామ నవరాత్రులు :

శ్రీరామ నవరాత్రులు వసంత నవరాత్రులనబడును సంవత్సరాదినుండి నవమివరకీ ఉత్సవములు నిర్వహింపబడును రామాయణ పారాయణములు, పురాణ కాలక్షేపములు, పూజలు, అర్చనలు, మంత్ర పుష్పము, అవధారయలు, రాజోపచారపూజలు శ్రీరామాలయమున నిర్వహింపబడును

నవమినాటి రాత్రి హరిహరాదుల ఊరేగింపు ఆడంబరముగ జరుగును వేల సంఖ్యలో భక్తులీ ఊరేగింపులో పాల్గొని, కీర్తనలు పాడి భజనలు చేయుదురు బ్రాహ్మణులు వేద మంత్రములను చదువుచు ఊరేగింపులో పాల్గొందురు

శ్రీరామ నవమినాడు శ్రీ సీతారాముల కల్యాణోత్సవము కన్నుల పండువగా నిర్వహింపబడును

## 3. హనుమజ్జయంతి :

ప్రతి యేడు చైత్ర శుద్ధ పౌర్ణమినాడు హనుమజ్జయంతి ఉత్సవము జరుపబడును వేములవాడలోని భీమేశ్వరాలయమున గల ఆంజనేయస్వామికి పురుష సూక్తయుక్త అభిషేకములు, అర్చనలు, సింధూరాలంకరణము, ధూపదీప నైవేద్యాదు లర్పింపబడును ఈ ఆంజనేయస్వామి మహత్తు గలవాడని ప్రజలు నమ్ముదురు మ్రొక్కులు చెల్లించి తమ భక్తిని ప్రకటించుకొనెదరు

## 4. శంకర జయంతి :

ప్రతి సంవత్సరము వైశాఖ శుద్ధపంచమి మొదలు నవమివరకు వేములవాడలో శ్రీ జగద్గురు శంకరాచార్య జయంతి అత్యంత వైభవోపేతముగ నిర్వహింపబడును

ఆదిశంకరులు చిత్రపటమునకు భక్తులు పూజ లొనర్తురు శంకర భగవత్పాదుల చిత్ర పటమును పల్లకిపైనుంచి వేదమంత్రములను పఠించుచు విప్రవరులు ఊరేగింతురు స్వామి, అద్వైత సిద్ధాంతముల నాకళింపుజేసికొనిన మహామహులు, వేద పండితులు అద్వైతామృత బోధలను ఉపన్యాసములద్వారా ప్రజలకు తెలుపుదురు ఈ ఉత్సవ దినములందు ప్రతిరోజు సాయంకాలములందు వసంత పూజలు నిర్వహింపబడును

## 5. ఆషాఢ ఏకాదశి :

ఇది తొలిఏకాదశి యనబడుచున్నది ఈ పర్వదినమున రేయింబవళులు సంతర్పణలు జరుగును ఏకాదశి దీక్ష వహించినవారు ఉపవాసముండి, రుద్రాభిషేకములు, వైష్ణవాలయములందు

పూజలు నిర్వహింతురు ఆనాటి సాయంకాలము విరలేశ్వరాలయమున మహాపూజ జరుగును వందల కొలది భక్తులీ పూజా మహోత్సవమున పాల్గొందురు

## 6. శ్రావణ పౌర్ణమి :

శ్రావణ శుద్ధ పౌర్ణమిని శ్రావణి యందురు ఈ దినమున ప్రాతఃకాల స్నానానంతరము సంధ్యావందనము చేసికొని నూతన యజ్ఞోపవీతములను ధరింతురు ఇది ఉపా కర్మ యనబడును ఉత్తర హిందూ దేశమందు దమలులోనున్న రక్షాబంధనము, దక్షిణాపథ దక్షిణ భారతము లందు పాటింపబడుచున్నది ఈ దినమున సోదరులకు సోదరీమణులు రక్షాబంధన మొనర్తురు రాఖీలు కట్టుట నేడు సర్వ సాధారణమైనది కుల మత వివక్ష లేకుండ రాఖీబంధన మొక సంప్రదాయముగ, ఆచార ముగ అమలులోనికి వచ్చినది ఈ పండుగ రాఖీ పండుగ యనబడుచున్నది యజ్ఞోపవీత ధారణము వలన ఈ పండుగ జంధ్యాల పున్నమిగ పిలువబడుచున్నది ఈ పండుగను వేములవాడలోని అన్ని దేవాలయములందు నిర్వహింతురు ఆనాడు ప్రత్యేక అభిషేకములు పూజలు నిర్వహింపబడును

## 7. జన్మాష్టమి :

ప్రతి సంవత్సరము శ్రావణ బహుళ అష్టమి తిథిరోజు శ్రీకృష్ణ జన్మాష్టమి పండుగ నిర్వహింపబడును. ఆనాడు శ్రీకృష్ణుని బాల్యక్రీడలకు సంబంధించిన ఘట్టములు ప్రదర్శింపబడును భీమేశ్వరాలయమునందీ దినమున స్వామివారికి షోడశోపచారములతో గూడిన పూజలు నిర్వహింపబడును. శ్రీకృష్ణుని పూజించి, ఉపవాసముండి సాయంత్రము ఫలహారము చేయువా రనేకులా రాత్రి జాగరణము చేయుదురు శ్రీకృష్ణుని లీలావిలాసములకు చెందిన గాథలను విందురు హరికథలు, భాగవతములు, నాటకములు, సినిమాలవంటి వినోదములతో ప్రొద్దు పుచ్చుదురు జన్మాష్టమి గోకులష్టమిగా వ్యవహరింపబడుచున్నది పండుగ మరునాడు కొన్ని ప్రాంతములందు ఉట్లు కొట్టు ఆచారమమలులో నున్నది శ్రీకృష్ణ నామ సంకీర్తనములందు కొందరు భక్తులు తేలియాడుచుందురు వైష్ణవ, స్మార్తాది మతానుయాయులీ కృష్ణాష్టమి పండుగను వేడుకగా జరుపుచుందురు

## 8. గణేశచతుర్థి :

ప్రతి సంవత్సరము భాద్రపద శుద్ధ చవితి రోజున గణేశచతుర్థి పండుగ నిర్వహింపబడును. భారతదేశమందన్ని ప్రదేశములందు గణపతి పూజలు యథావిధిగా నిర్వహింపబడును హైందవ మతానుయాయులీ దినమున గణపతి విగ్రహములను గృహములందు నిలిపి షోడశోపచార పూజలు నిర్వహింతురు గణాధిపతి గుణ గణములను శక్తి సామర్థ్యములను తెలుపునట్టి అనేక కథలను చదువుదురు.



దర్మకుండము వద్దగల శివలింగము



మహాగణపతి



కేదారేశ్వర లింగము





రాజేశ్వరాలయ ఆవరణమందున్న దర్గా



ధ్వజస్తంభము





శివలింగము, గణపతి, తదితర విగ్రహములు

భాద్రపద శుద్ధ చవితి మొదలు ద్వాదశివరకు గణపతి నవరాత్రులు జరుపుదురు ఒక్క వేములవాడ యందే గాక భారతదేశమందలి అన్ని ముఖ్య పట్టణములందు వీథి వీథిన బృహద్గణపతి విగ్రహములు నెలకొల్పి నవరాత్రి ఉత్సవములు నిర్వహింతురు

ఈ నవరాత్రులందు నిత్యపూజలు, నిత్యారాధనములు, భజనలు, హరికథలు, నాటకములు, సినిమాలు, కోలాటములు, కొన్ని ప్రాంతములందు తోలుబొమ్మలాటలు ప్రదర్శింపబడుచుండును

చివరి దినమున గణపతి విగ్రహములను సమీపమందున్న తటాకమందుగాని, బావుల యందుగాని, కుంటలలోగాని, నదులయందుగాని నిమజ్జనము గావింతురు

వేములవాడలో గణపతి నవరాత్రము లత్యంత వైభవోపేతముగ నిర్వహింపబడుచుండును

## 9. దేవీ నవరాత్రములు లేక శరన్నవరాత్రములు :

ప్రతి యేడు ఆశ్వీజమాస ప్రథమదివసమునుండి దశమివరకు దేవీ నవరాత్రులు, విజయ దశమి పండుగ నిర్వహింపబడును ఈ నవరాత్రులందు రాజరాజేశ్వరీదేవి, పార్వతీదేవి విగ్రహము లారాధింపబడును అమ్మవారిని తొమ్మిది దినములలో ప్రతిదిన మొక రూపముగ నలంకరింతురు ఈ నవరాత్రి ఉత్సవములను నిర్వహించువారు నిష్ఠగా నుందురు సప్తశతి పారాయణము, దేవీ భాగవత ప్రవచనములు, నిత్యపూజలు, ఊరేగింపులు అమ్మవారికి నిర్వహింతురు. వేములవాడ క్షేత్రమున దేవీ నవరాత్రు లతివైభవముగా నిర్వహింపబడును

విజయదశమి తిథినాడు ఆయుధపూజ లొనర్చి, శమీవృక్షపూజలందు సమస్త జనులు పాల్గొందురు స్వామి ఊరేగింపుగా వెళ్ళి శమీవృక్ష ప్రదక్షిణమొనర్చి గ్రామమందలి ప్రధాన వీథుల నుండి ఊరేగింపుగా వచ్చి ఆలయమును చేరును ఈ శమీవృక్ష దర్శనమునకు గ్రామమందలి ప్రజ లతి ఉత్సాహముతో వెళ్ళి శమీపూజలు చేసివత్తురు ఒకరికొకరు జమ్మిపత్రి నిచ్చిపుచ్చుకొని పరస్పరాలింగనము లొనర్తురు

ఈ పండుగ తెలంగాణమందంతట గొప్ప వేడుకతో నిర్వహింపబడుచున్నది

## 10. కోజాగిరి పూర్ణిమ :

వేములవాడ పట్టణమున రాజేశ్వర క్షేత్రమందు ఆశ్వీజ శుద్ధ పౌర్ణమి రోజీ ఉత్సవమును అర్థరాత్రివరకు జరుపుదురు పాల పాత్రలో చంద్రుని దర్శించి స్వామివారి కర్చనలు చేయుదురు ఇది యొక ప్రత్యేకమైన పండుగ

## 11. దీపావళి :

ఆశ్వీజ బహుళ అమావాస్యనాడు దీపావళి పండుగను నిర్వహింతురు భారతావనిలో సమస్త ప్రజలీ పండుగ నత్యంతోత్సాహమున జరుపుకొందురు వేములవాడలో నరకచతుర్దశి, దీపావళి పండుగ కనులపండువుగా నిర్వహింపబడును ప్రభాతసమయమున రాజేశ్వరస్వామికి, తదితర దైవములకు మంగళహారతు లివ్వబడును ఆనాడు ప్రతి ఇంట మంగళహారతులు, తలంటు స్నానములు, పూజలు, వంటలు ఘనముగా చేసుకొని పండుగ జరుపుకొందురు దీపాలంకరణలు, ధనలక్ష్మి పూజలు, కేదారేశ్వర వ్రతములు, ఊరేగింపులు వేములవాడలో జరుగును పిల్లలు పెద్దలను భేదము లేకుండ నూతన వస్త్రములు ధరించి బాణసంచా కాల్చుదురు ఈ పండుగకు క్రొత్త అల్లుండ్రను, కుమార్తెలను పిలిచి, వారికి పంచభక్ష్యపరమాన్నములతోపాటు నూతన వస్త్రములను, కానుకలను అందింతురు

## 12. కార్తీకమాసము :

కార్తీక మాసమంతయు రాజేశ్వరస్వామి సన్నిధిలో దీపాలంకరణము జరుగును ఆలయ గోపురములు, ద్వారములు దీపములతో నలంకరింపబడును కార్తీక మాహాత్మ్య పురాణ కాలక్షేపము ప్రతిదిన ముదయము జరుపబడును ఈ మాసమంతయు లక్షవత్తుల దీపములు, తులసీ పూజలు ఘనముగ నిర్వహింతురు

## 13. తులసిపూజ :

కార్తీక శుద్ధ ద్వాదశిరోజు తులసి వివాహ మతివైభవముగ నిర్వహింపబడును కొందరీ దినమం దుపవాసముండి సాయంత్రము తులసి కోటముందు అలికి ముగ్గులువేసి విధి విధానమున పూజలు చేసి తులసి వివాహము నత్యంతోత్సాహమున భక్తి ప్రపత్తులతో నిర్వహింతురు

## 14. వైకుంఠ చతుర్దశి :

కార్తీక మాసమున శుక్ల చతుర్దశి పర్వదినమున వైకుంఠ చతుర్దశి ఉత్సవము నిర్వహింపబడును

రాజరాజేశ్వరస్వామి కభిషేకము, అర్చనలు, సహస్రకమలార్చనలు జరుపబడును

రాత్రి 8 గంటలకు అనంత పద్మనాభస్వామికి తులసీదళ సహస్రార్చనలు జరుపబడును

శ్రీ కేదారేశ్వరాలయమున ప్రదోషపూజ జరుపబడును శ్రీ మహావిష్ణువు కేదారేశ్వరుని సహస్ర కమలములచే పూజించి మహేశ్వరుని అనుగ్రహమున సుదర్శన చక్రమును పొందెను.

ఉదయము శివార్చన, ప్రదోష కాలమున విష్ణుమూర్తిని పూజించుట పౌరాణికాచారము.

## 15. కార్తీక పౌర్ణమి :

కార్తీకస్నానము లొనర్చుట హైందవ సంప్రదాయము కార్తీకపౌర్ణమి మహాపర్వ దినముగ పరిగణింపబడుచున్నది తైర్థికులు, కార్తీక పౌర్ణమి దినమున వేములవాడలోని ధర్మకుండమున స్నాన మాచరింతురు రాత్రివరకు అభిషేకములు జరుగుచుండును అభిషేకముల తరువాత రాజేశ్వరస్వామి పూజాదికములు వైభవోపేతముగ నిర్వహింపబడును కార్తీక పౌర్ణమినా డుదయము ఉసిరిక కాయను శరీరమునకు రాసుకొని స్నానమొనర్చుట పుణ్యప్రదమని హిందువులు భావింతురు

## 16. ధనుర్మాసోత్సవము :

ధనుస్సంక్రమణ రోజునుండి ఒక మాసము వరకు రాజరాజేశ్వరస్వామికి బాలభోగము నిర్వహింపబడును అధ్యయనోత్సవము కూడ జరుగును వేములవాడలోని వేణుగోపాలస్వామి ఆలయ మునం దధ్యయనోత్సవ మతి వైభవముగా నిర్వహింపబడును

## 17. వైకుంఠ ఏకాదశి :

మార్గశిర శుద్ధ ఏకాదశి తిథియందు వైకుంఠ ఏకాదశి పర్వదినము జరుపబడును ఆనాడు వైకుంఠ ద్వారమును దర్శింతురు హరిహరుల కావలు మహాద్వారమువరకు తీసికొని వెళ్ళుదురు వేద పారాయణములు, శాస్త్రచర్చలు, గీతా జయంత్యుత్సవములీ వైకుంఠ ఏకాదశినాడు ప్రారంభింపబడును వైకుంఠ ఏకాదశినాడే శ్రీకృష్ణుడు అర్జునునకు గీతోపదేశ మొనర్చినట్లు ప్రజలు భావింతురు

## 18. దత్త జయంతి :

ప్రతి యేడు మార్గశిర శుద్ధ పౌర్ణమినాడు దత్త జయంతిని జరుపుదురు ఆ రోజు దత్త జయంత్యుత్సవముతోపాటు, భజనలు, ఉపన్యాసములు, ఆధ్యాత్మిక చింతనకు సంబంధించిన చర్చా గోష్ఠులు, హరికథా కాలక్షేపములు నిర్వహింపబడును

## 19. కాలభైరవాష్టమి :

ప్రతి సంవత్సరము మార్గశిర బహుళ అష్టమీ తిథి కాలభైరవాష్టమిగా భావించి, కాలభైర వుని కర్చనలు చేయుదురు వేములవాడలోనున్న కాలభైరవుని కభిషేకములు, పూజాదికము లత్యంత భక్తి శ్రద్ధలతో జరుపుదురు

## 20. త్యాగరాజోత్సవములు :

త్యాగరాజు స్మారకోత్సవములు, ప్రతి సంవత్సరము పుష్యబహుళ పంచమినుండి నవమి వరకు ఐదు రోజులు వైభవోపేతముగ నిర్వహింతురు. వివిధ ప్రాంతములందున్న సంగీత విద్వాంసుల

నాహ్వానించి, గానకచేరీల నేర్పాటు చేయుదురు వారివారి శక్తిసామర్థ్యములను, సంగీతశాస్త్ర పరిజ్ఞానము ననుసరించి దేవస్థానమువారు పారితోషికముల నందింతురు

## 21. మహా శివరాత్రి :

శివరాత్రి మహోత్సవములు వేములవాడ రాజరాజేశ్వరాలయమున మాఘ బహుళ చతుర్దశి నుండి ఫాల్గుణ శుద్ధ పాడ్యమివరకు మూడు దినము లతి వైభవముగ జరుగును ఈ మూడు దినములు శివరాత్రి జాతరగా పరిగణింపబడును కరీంనగర్ జిల్లాలోని ప్రతి మండలము నుండి అసంఖ్యాకముగ భక్తులు వచ్చి రాజేశ్వరస్వామి వారి కభిషేకములు చేసి జాతరలో పాల్గొందురు హైదరాబాదు, తదితర పట్టణముల నుండియు, తెలంగాణ మందలి ఇతర జిల్లాల నుండియు, బొంబాయి, షోలాపూర్, అహమదాబాదు నగరములందున్న తెలంగాణ ప్రాంతీయు లీ ఉత్సవములందు పాల్గొనుటకు వచ్చు చుందురు

రాజరాజేశ్వరస్వామి కానాటి ఉషఃకాలము నుండి అర్థరాత్రివరకు అభిషేకములు నిర్వ హింపబడును వేల సంఖ్యలో భక్తు లేతెంచి ధర్మకుండమున స్నానమాచరించి రాజేశ్వరుని కభిషేకము లొనర్చి, వేములవాడలోని అన్ని దేవాలయములను దర్శించి లింగోద్భవ కాలమందు ఆలయార్చకులు చేయు అభిషేకమును తిలకించి, భక్తి భావమున మహాశివుని దర్శించి, జాగరణమొనర్చి మరునాటి పూజలను తిలకించి వేడుకలందు పాల్గొని తరించుచుందురు

## 22. హోళీపండుగ :

ఫాల్గుణ శుద్ధ పౌర్ణమి హోళిపండుగ దినము తెలంగాణమందంతట హోళీ పండుగను శ్రద్ధాసక్తులతో నిర్వహింతురు ఇది వసంతోత్సవ దినము స్త్రీ పురుష బాలవృద్ధ వివక్షలేకుండ, హోళి కోత్సవమున పాల్గొందురు పిచికారీలతో రంగునీళ్ళు చల్లుకొందురు. కొందరు బుక్కా, గులాలు, గంధపు పొడివంటి సుగంధ ద్రవ్యము లొకరిపై నొకరు చల్లుకొని మధ్యాహ్న సమయమున స్నానమాచరించి పండుగ జరపుదురు

హోళీ పండుగకు ముందుదినము రాత్రి కామదహన మొనర్తురు. బాలురు, ఒకరికన్న నొకరు ఉత్సాహవంతులై కాముని దహన క్రియలో పాల్గొందురు

## 23. శివ పార్వతుల కల్యాణోత్సవము :

వేములవాడలో జరుగు అన్ని ఉత్సవముల కన్న పార్వతీ పరమేశ్వరుల కల్యాణ మహో త్సవ మతి వైభవముగా నిర్వహింపబడును పంచాహ్నిక విధానమున శివపార్వతుల కల్యాణోత్సవము



రాజేశ్వరాలయ వాహనశాల



రాజేశ్వరాలయము - హోమకుండము

ఆలయోద్యోగులు



పర్వతగిరి దర్మశాల



తిరుమల తిరుపతి దేవస్థానము వారి స్త్రతము



రాజరాజేశ్వరస్వామి సంస్కృత పారశాల
కళాశాల బవనము



రాజేశ్వరాలయ అర్చకులు
శ్రీయుతులు నందగిరి శంకరయ్య
శ్రీయుతులు మామిళ్ళపల్లి శ్రీరాములు, ఆలయసిబ్బంది

రెండవ అరికేసరి కరీంనగర్ శిలాశాసనము



మొదటిప్రక్క

ప్రతియేట ఫాల్గుణ మాస కృష్ణ పక్ష విదియనా డారంభమగును ఆనాటి ఉదయము నుండి తండోపతండములుగా వివిధ ప్రాంతముల నుండి భక్తులు కల్యాణోత్సవ వేడుకలందు పాల్గొనుటకు వచ్చు చుందురు కల్యాణోత్సవ దినము నాటికే దూర ప్రాంత వాసులు వేములవాడకు వచ్చి ధర్మసత్రము లందు బస చేయుదురు

సంగీత సాహిత్య సమావేశములు, వేద ఘోషలు, పురాణ ప్రవచనములు, వాద్య విన్యాస ములు, హరికథా కాలక్షేపములు నయనానందకరముగ జరుగును ఉత్సవము జరిగినన్నాళ్ళు హరిహరులు దినమున కొక వాహనముపై ఊరేగుదురు కల్యాణోత్సవములు ముగియునాడు రాజేశ్వరస్వామి, అమ్మ వారు, ఇతర దేవతా మూర్తులు పదునొకండు పర్యాయములు ప్రదక్షిణములు చేసి ఊరేగు ఆచారము వేములవాడలో నున్నది

వేదవేదాంగములను, పురాణేతిహాస కావ్యాదులను, షడ్దర్శనములను తర్క మీమాంసాది సమస్త శాస్త్రములను క్షుణ్ణముగా తెలిసిన పండితులీ ఉత్సవములందు పాల్గొందురు.

దేవస్థాన నిర్వాహకులీ ఉత్సవముల నతివైభవముగా నిర్వహింతురు కలియుగ కైలాసము వలె, దక్షిణ వారణాసివలె వేములవాడ పార్వతీ పరమేశ్వరుల కళ్యాణ మహోత్సవములందు కన్నుల పండువుగ నుండును

వేములవాడ చాళుక్యవంశ మంతరించిన పిదప సబ్బిసాయిర మండలముతోపాటు వేములవాడ, కల్యాణీ చాళుక్యుల అధికారములోనికి వచ్చినది కల్యాణీ చాళుక్య వంశమును నిర్మూలించి కాలచురి బిజ్జలుడు అధికారము చేపట్టిన పిదప, అనేక రాజకీయ పరిణామములు సంభవించినవి. బిజ్జలుడు చాళుక్య సామ్రాజ్యమంతటికి చక్రవర్తి కావలెనని బలవంతులైన సామంత మాండలికులను తన సార్వ భౌమాధికారమునకు లోబడి యుండునట్లు వత్తిడి గావించెను

కాకతి రుద్రదేవు డతని నెదిరించి, బిజ్జలుని కనుకూలురైన పొలవాస మేడరాజును, ఏడె రాజును, కందూరి భీమదేవ చోడాదుల నోడించి, స్వతంత్ర కాకతి రాజ్యమును స్థాపించెను. అప్పటి నుండి వేములవాడ కాకతి రాజన్యుల ఏలుబడిలోనికి వచ్చినది

కాకతి రాజ్యము క్రీ. శ 1323 లో పతనమైనది ఢిల్లీ సుల్తానుల రాజ ప్రతినిధు లోరుగల్లును పాలించిరి ముసునూరి ప్రోలయ, కాపయ నాయకులు, రేచర్ల సింగమనేడు, కొండవీటి అనవేమారెడ్డి ప్రభృతులు తురుష్కుల పాలనమును తెలంగాణమునం దంతమొందించి ఓరుగల్లును స్వాధీన పరచుకొనిరి

మునునూరి వంశీయుల పాలనము భీమవరము యుద్ధముతో నంతమైనది వేములవాడ, సబ్బి సాయిర మండలము బహమనీ సుల్తానుల యేలుబడిలోనికి వచ్చినది బహమనీ వంశపు చివరి సుల్తాను మహమూద్షా క్రీ శ 1518 లో దివంగతుడయ్యెను తెలంగాణ సూబేదారుగానున్న సుల్తాన్ కులీకుతుబుల్ముల్క్ స్వతంత్రుడై అనేక ప్రాంతములను జయించి కుతుబ్షాహీ వంశ కీర్తి ప్రతిష్ఠల నినుమడింపజేసెను అతడు, అతని సంతతివారు సమస్తాంధ్ర భూభాగములను తమ యేలుబడిలోనికి దెచ్చుకొని పాలించిరి

పరమత సహన శూన్యుడైన మొగలు చక్రవర్తి ఔరంగజేబు, కపటోపాయమున క్రీ. శ 1687 లో గొలకొండ నాక్రమించెను. దక్కన్ సూబేదారు పరిధిలో తెలంగాణ మంతయు నుండెను. మొగలుల పాలనము తెలుగు దేశమున సుమారు ఎబది సంవత్సరములు సాగినది

ఢిల్లీ నగరము రాజకీయ అనిశ్చిత స్థితికిలోనై యున్న కాలమున విదేశ దండయాత్రల నెదుర్కొన లేని స్థితియందు ఢిల్లీ పాలకు లుండుటవలన నిజాము ముల్కుల్క్ అసఫ్జా స్వతంత్రుడై ఔరంగాబాదు కేంద్రముగా దక్కన్ ప్రాంతము నేలెను అతని వంశీయులు తెలంగాణమును మహా రాష్ట్ర మండలి 5 జిల్లాలను, కర్ణాటకమునకు చెందిన మూడు జిల్లాలను కలిపి హైదరాబాదు నగరము కేంద్రముగా క్రీ శ 1948 వరకు పాలించిరి వేములవాడ వీరి పరిపాలనమం దుండెను. నిజాము ప్రభువులు వేములవాడ దేవాలయ వ్యవహారములందు జోక్యము కలిగించుకొనలేదు భక్తులకు కావలసిన సదుపాయములను సమకూర్చుటకు కృషి చేసినారు

హైదరాబాదు రాష్ట్రముపై పోలీసు చర్య జరిగిన పిదప వెములవాడ ప్రజాపరిపాలన వ్యవస్థలోనికి వచ్చినది

క్రీ శ 1952 లో వేములవాడ అగ్రహారముపైగల అధికారమును ప్రభుత్వాదేశానుసారము జిల్లా కలెక్టరు వహించినాడు వేములవాడ రాజేశ్వరాలయము తదితర ఆలయముల నిర్వహణ కొరకు పాలక మండలి యేర్పరుపబడినది

ఆంధ్రప్రదేశ్ అవతరణానంతరము క్రీ శ 1966 లో వేములవాడ దేవాలయమున కొరకు చట్టబద్ధమైన ట్రస్ట్ బోర్డు యేర్పరుపబడినది దేవాలయములకు చెందిన భూములు, వాటి ఆదాయ వ్యయ ములు చూచు బాధ్యత ఈ ట్రస్ట్ బోర్డ్ సభ్యులు వహించిరి

భూమ్యాదాయము ఆలయముల నిర్వహణమునకు చాలకుండెను. భక్తులు, ప్రజలు స్వామి వారి కర్పించు విరాళములు, కానుకలు, ద్రవ్యము పూజాదికములు నిర్వహించుటకు తోడ్పడినవి.

కాలక్రమమున వేములవాడ రాజేశ్వర స్వామి ఆదాయ మధికమైనది దేవస్థానమువారు యాత్రికుల సౌకర్యార్థ మనేక కార్యములను చేపట్టి నిర్వహించినారు ధర్మశాలలు, కుటీరము లాధునిక వసతులు కలిగియుండునట్లు నిర్మించినారు వంటశాలలు, అంగళ్ళు, స్నానవాటికలు, తదితర వసతు లన్నియు యేర్పరచినారు

వేములవాడలోని భీమేశ్వరాలయమున కభిముఖముగా నొక విశాల కల్యాణ మండప నిర్మాణము గావింపబడినది మంచినీటి వసతులు, రాకపోకల సౌకర్యములు, ప్రశాంత వాతావణము, ఆధ్యాత్మిక శక్తి, వైదిక మతాచార వ్యవహారములు, తెలుగువారి సంస్కృతీ సభ్యతలు, పూర్వాచార ములు, నిత్యారాధనలు, నిత్యపూజలు, అద్వైతమత సంప్రదాయములకు నిలయమైన వేములవాడ మహా క్షేత్రము భక్తులపాలిటి కల్పతరువు రాజరాజేశ్వరస్వామి అభీప్సితార్థముల నెరవేర్చు మహిమాన్వి తుడు ఈ క్షేత్రము తెలంగాణ ప్రజలకే గాక యావద్భారత ప్రజల కారాధ్యమైనది

వేములవాడ పట్టణమునంటి ప్రవహించు వాగు మధ్యలో గంగాదేవి కాలయము నిర్మింప బడినది ఈ ఆలయములో నిత్యము పూజలు నిర్వహింపబడుచుండును ముఖ్యముగా గంగపుత్రులీ ఆలయమందు ప్రతిష్ఠింపబడిన గంగాదేవి విగ్రహమును భక్తిప్రపత్తులతో నర్చింతురు

మల్లారము వాగున కానకట్టి నిర్మించి కాలువలద్వారా నీటిని వేములవాడ గ్రామమందున్న తటాకమును నింపుదురు కావున లక్షల సంఖ్యలో రాజేశ్వరస్వామిని సేవించుటకు వచ్చు యాత్రికులకు నీటి యెద్దడి లేదు

వేములవాడ రాజేశ్వరాలయము సింహద్వారము శిథిలరూపమందుండ దేవస్థానమువా రపురూపమైన సింహద్వారమును నిర్మించినారు దీని గోపురము సమున్నతమైనది. అట్లే ఇతర నిర్మాణములు శిథిలావస్థలోనుండ పునర్నిర్మింపబడినవి

తిరుపతి తిరుమల దేవస్థానమువారు యాత్రికుల సౌకర్యార్థ మిచట గొప్ప సత్రమును నిర్మించినారు వేములవాడ దేవాలయ నిర్వాహక మండలి, కార్యనిర్వహణాధికారి, వారి సహచరులు రాజరాజేశ్వర క్షేత్రము నవర కైలాసముగా తీర్చిదిద్దుటలో అహరహము శ్రమించుచుందురు

వేములవాడ దేవస్థాన పరిధిలో శ్రౌత స్మార్తవిద్యా శిక్షణాకేంద్రమున్నది. ఇందుచిత శిక్షణ మొసంగబడును ఇచట నొక సంస్కృత పాఠశాల నడుపబడుచున్నది. ఉత్తమ విద్యార్థుల కుపకార వేతనములు, ప్రశంసాపత్రము లివ్వబడుచున్నవి.

గీతా జయంతి సందర్భమును పురస్కరించుకొని వేములవాడ యందున్న విద్యా సంస్థలందు విద్యాభ్యాస మొనర్చు విద్యార్థులకు పరీక్షలను నిర్వహింతురు. ఇందు తీర్ణులైన వారి కుపకార వేతనములు, బహుమతులు, ప్రశంసాపత్రము లివ్వబడును వేములవాడలోని ధర్మకుండముల నావరించి యున్న చెరువు కట్టపై సమతల ప్రదేశమున గీతా భవనము నిర్మింపబడినది

వేములవాడ దేవాలయ మాదాయమున ఆంధ్రప్రదేశమందున్న ఆలయములలో ఐదవ స్థాన మాక్రమించి యున్నది ఈ దేవస్థానమువా రనేక ధర్మ సంస్థలకు, ధర్మకార్యములకు ఆర్థిక సహాయ మొనర్చుచున్నారు

వర్షాకాలమందీ ప్రాంతమున కలరా వంటి వ్యాధులు వ్యాపింపకుండ తగిన చర్యలను దేవస్థానమువారు తీసుకొనుచుందురు ప్రభుత్వ ఆరోగ్య శాఖవారు రాజేశ్వరస్వామి ఉత్సవములందు ప్రమత్తులై పారిశుద్ధ్యమున కనేక చర్యలను తీసుకొందురు.

దేవాలయ నిర్వాహకులు వేములవాడలో నొక వైద్యశాలను నిర్వహించుచున్నారు వైద్య ఆరోగ్య పారిశుద్ధ్యముల బాధ్యత వహించుచు ఈ వైద్యశాల ప్రజలకు, తైర్థికులకు ఉచిత వైద్యసేవల నందించుచుండును

వేములవాడ దేవాలయ నిర్వాహకు లొక గోశాలను నిర్వహించుచున్నారు స్వామివారి అభిషేకములకు, దధిక్షీరముల నందించు బాధ్యత ఈ గోశాల వహించును.

రాజేశ్వరస్వామి, తదితర దేవతల అర్చనలకు పుష్పములు సమకూర్చుట కాలయనిర్వాహకు లొక పూదోటను వేసినారు పలు రకములైన పూవులతో అనుదినము త్రికాలము లందు రాజరాజేశ్వర స్వామి నర్చించు ఆచార మిచట నున్నది.

పూర్వము కరీంనగర్ జిల్లాలోని పలు ప్రాంతములందల్లకల్లోలములు, దౌర్జన్యములు సంభవించినపుడు ఆయా ప్రాంతములందున్న ప్రజలు తమ ఆస్తిపాస్తులను, పంట పొలములను వదిలివేసి ప్రాణరక్షణార్థము వేములవాడ కేతెంచుచుండిరి దుష్ట శక్తులు వేములవాడ వచ్చుటకు వెరచుచుండెను

వేములవాడ క్షేత్ర మందున్న రాజరాజేశ్వర స్వామి, భీమేశ్వరస్వామి, తదితర దేవతలు విగ్రహముల రూపముననూ, లింగాకారముగను ఉండి మహా మహిమాన్వితులై భక్తుల పాప పంకములను ప్రక్షాళనము చేయునట్టి శక్తి కలవారని భావింపబడుచున్నది

వేములవాడ భీమేశ్వరస్వామి వర పుత్రునిగా భీమకవి ప్రసిద్ధుడు ఈ కవి వశ్య వాక్కు కలవాడు భీమకవి ద్రాక్షారామ ప్రాంతమందున్న వేములవాడ నివాసి యని, అతడు ద్రాక్షారామ భీమేశనందనుడని తెలుపుకొనినాడని, ఘనుడన్ వేములవాడ భీమకవి నని వ్రాక్కుచ్చినాడని మహా మహులైన పండిత ప్రవరుల అభిప్రాయము

కాని వాస్తవముగ వేములవాడ భీమకవి సబ్బిసా[redacted] మండలమందున్న వేములవాడ నివాసియే

వేములవాడ భీమకవి విరచిత కవిజనాశ్రయమను ఛందోగ్రంథము మల్లియ రేచనయను జైన వైశ్య పుంగవుడు రచించినట్లు సుప్రసిద్ధ శాసన పరిశోధకులు డా పి. వి పరబ్రహ్మశాస్త్రిగారి అభిప్రాయము

రెండవ అరికేసరి మహారాజు ఆస్థానకవి పంపడు. పంపని సోదరుడు జినవల్లభుడు కుర్క్యాల గండ శిలా శాసనమును వేయించినవాడు. జినవల్లభుని శాసనము కన్నడ సంస్కృతాంధ్ర భాషలలో నున్నది ఈ శాసనమున మూడు కంద పద్యములున్నవి మల్లియ రేచన, జినవల్లభుడు మంచి స్నేహితులు జినవల్లభుని ప్రోత్సాహమున కవిజనాశ్రయ గ్రంథమును రేచన రచించినట్లు డా॥ పరబ్రహ్మశాస్త్రి గారభిప్రాయపడినారు తరువాతి కాలమున మల్లియరేచన విరచిత కవిజనాశ్రయము వేములవాడ భీమకవి పేర ప్రఖ్యాతి గాంచినదని పలువురి అభిప్రాయము

కాని భవిష్య పురాణము, కవిజనాశ్రయ గ్రంథముల ననుసరించి భీమకవి జన్మస్థలము వేములవాడయే యనియు, భీమేశ్వరుడు వేములవాడ భీమేశ్వరుడే యనియు తెలియవచ్చుచున్నది ద్రాక్షారామ మునకు తొలి నామము డాకరేమి

వేములవాడలోని భీమేశ్వరాలయమునగల భీమేశ్వర లింగ మున్నతమైనది. ప్రతి దినము రాత్రి యందొక సర్ప రాజము వచ్చి భీమేశ్వర లింగమును చుట్టుకొని కొంత తడవుండి వెళ్ళుచుండు నని స్థానికుల కథనము. అదృష్ట జాతకుల కీ సర్పము కనిపించునని యందురు

భీమేశ్వరస్వామి మహిమను తెలియజేయు భీమకవి గాథ ప్రచారమందున్నది వేములవాడ యందున్న వారికి, చుట్టు ప్రక్కలనున్న గ్రామీణులకీ భీమకవి గాథ తెలియును

వేములవాడ పట్టణమం దొక విప్ర వనిత యుండెడిది ఆమె పితంతువు బాల్యమందే భర్త మరణించుట వలన తన దురదృష్టమును తలపోయుచు భీమేశ్వరస్వామి నతి భక్తిప్రపత్తులతో నర్చించేడిది భక్తి పారవశ్యమున శివ గీతికల నాలాపించేడిది భక్తిలో తన్మయత్వమును చెందెడిది.

ఒక పర్యాయ మామె తన్మయురాలై స్పృహ కోల్పోవు సమయమున భీమేశ్వరస్వామి సుందరరూప మామెకు సాక్షాత్కరించెను ఆ విప్ర వితంతువు స్వామిని చూసి ఆనందపరవశయై తనకొక పుత్రుని ప్రసాదించుమని పరమేశ్వరు నర్థించెను భీమేశ్వర స్వామి అట్లే యగునని దీవించి అదృశ్యుడయ్యెను

భీమేశ్వరస్వామి కటాక్షమున ఆ విప్ర వితంతువు గర్భము ధరించి నవమాసములు మోసి, ఒక మగ బిడ్డకు జన్మనిచ్చినది. వేములవాడ యందున్న విప్ర కుటుంబముల వారు వైదికాచార సంపన్నులు వారు వితంతు, బిడ్డను కనినందులకు విచారము వ్యక్తపరచి ఆగ్రహావేశులై వితంతు కుటుంబమును బ్రాహ్మణ సంఘమునుండి వెలివేసిరి ఐనను దైవానుగ్రహ జనితుడగు బాలుని ఆమె అల్లారుముద్దుగ పెంచి పెద్ద జేసినది భీమేశ్వరస్వామి పేర నా బాలుడు భీమన యనబడినాడు.

భీమన పెద్దవాడై తోటి బాలురతో నాటలాడుచు ప్రొద్దుపుచ్చుచుండెను విప్ర బాలకులు భీమనను చులకనచేసి మాట్లాడుచుండిరి ఒక పర్యాయము వారు భీమనను నీ తండ్రి యెవరని ప్రశ్నించిరి భీమన తల వంచుకొని మాటాడకుండెను విప్రబాలురతని నవహేళనము చేసిరి భీమన వ్యాకుల చిత్తుడై అవమాన భారమును భరింపలేక తల్లి చెంతకేగి "తన తండ్రి ఎవరో తెలుపమని" నిర్బంధించెను భీమన తల్లి సమాధాన మివ్వజాలక, కొంత తడవాగి "నీ తండ్రి భీమేశ్వరస్వామి" యని తెలిపెను

భీమన భీమేశ్వర స్వామిని భక్తితో అర్చించి ప్రార్థించెను తనకు జరిగిన అవమానమును దీనుడై విన్నవించెను భీమేశ్వరస్వామి భీమన మనోవేదనను గమనించి అతనికి వశ్య వాక్కు ననుగ్రహించెను

అప్పటినుండి నీ తండ్రి ఎవరని అడిగినవారికి భీమేశ్వరుడని భీమన సమాధాన మిచ్చుచుండెను.

ఒక పర్యాయము వేములవాడలో చాతుర్మాస్య సమారాధన జరిగినది గ్రామమందలి విప్ర కుటుంబములవారందరు ఆహ్వానింపబడినారు భీమన కుటుంబము వెలివేయబడినది కావున వారి నా సమారాధన కాహ్వానింపలేదు

భీమన సమారాధన స్థలమున కేగి వెలుపల నిలిచియుండెను అతని నెవ్వరును భోజనమునకు రమ్మని అహ్వానింపలేదు. వచ్చిపోవు బ్రాహ్మణులు భీమన నీసడించుకొనుచుండిరి వడ్డనలు పూర్తియైనవి. భీమన అవమానమును సహింపక కోపోద్రిక్తుడై బ్రాహ్మణుల ఛాందస భావములకు,

మూఢాచారములకు విచారించి, అన్నమంత సున్నము కావలె, అప్పాలన్ని కప్పలు కావలెనని ఎలుగెత్తి అరచెను వశ్యవాక్కుగల భీమన నోటివెంట ఈ మాటలు వెలువడిన వెంటనే వడ్డించిన విస్తళ్ళలోని అన్నము సున్నముగను, అప్పాలు కప్పలుగను మారెను కప్పలు బెకబెక మనుచు అటునిటు గంతులు వేయుచుండెను విస్తళ్ళముందు కూర్చుని భోజనమున కుపక్రమించిన విప్రులు బ్రాన్పడి అటు నిటు చూచుచు, లేచి భోజనశాలను వీడి వెలుపలికి వచ్చిరి

భీమన వాక్ఫలితమీ అనర్థమునకు కారణమని భావించి విప్రులు అతనిని సగౌరవముగా ఆహ్వానించి, "మాకు కనువిప్పైనది మా అపరాధము మన్నింపుము మీ కుటుంబమును మేము వెలివేసి యుంటిమి మేము వెలి నుపసంహరించుకొనుచున్నాము" అని చెంపలు వేసికొని క్షమాపణము చెప్పిరి

కొందరు బ్రాహ్మణులు భీమన గృహమునకేగి ఆతని తల్లిని "తాము గావించిన తప్పిదమును మన్నించుమని" ప్రార్థించి సమారాధన కాహ్వానించిరి

విప్రుల విన్నప మాలకించి భీమన "సున్నమంత అన్నము కావలె, కప్పలన్ని అప్పాలు కావలె"నని పలికెను భీమేశ్వర వర ప్రసాదియగు భీమన వాక్కు వెలువడినంతనే యథావిధి సున్నము అన్నముగను, కప్పలు అప్పాలుగను మారిపోయెను నాటి నుండి వేములవాడలోని విప్ర కుటుంబముల వారు భీమనను వశ్య వాక్కుకల వానిగను, మహాకవిగను కీర్తించి గౌరవించిరి

సహజకవియు, వశ్యవాక్కుగలవాడుగను, ప్రజా కవిగను, ఆశు కవిగను, శాపమునిచ్చి ఉపసంహరించు శక్తిగల మహిమాన్వితుడుగను వేములవాడ భీమ కవి దేశ సంచార మొనర్చుచు అనేక రాజ్యములను దర్శించెను తనను గౌరవించి సన్మానించిన రాజులకు శుభములు కలుగునట్లాశీర్వదించి, అగౌరవ పరచిన నృపులను శప్తులను గావించుచు, సర్వాంధ్ర భూభాగములను ముఖ్యముగా వేంగీ మండలమును, త్రికళింగములను, వివిధ ప్రదేశములను చేరెను అనేక పుణ్య క్షేత్రములను దర్శించెను ద్రాక్షారామ భీమేశ్వరు నర్చించెను

వేములవాడ భీమకవి దేశసంచార మొనర్చు కాలమున, వేములవాడలో జైన మతానుయాయుల సంఖ్య యినుమడించెను చాళుక్య ప్రభువులు జైనమతానుయాయు లగుటవలన జైనమతము రాజమతముగా పరిఢవిల్లెను జైనమునులు, తీర్థంకరుల కాలయములను నిర్మించి ప్రభువుల మన్ననలను పొంది, జిన భవనములకు, జినాలయములకు అగ్రహారములను సమకూర్చుకొనిరి వేములవాడ రాజ్యము జైన మతానుయాయులమయమయ్యెను భీమకవి వేములవాడస్థితిగతులను,జైనమత విజృంభణమును తెలిసికొని

తీరాంధ్రమందే స్థిరనివాస మేర్పరుచుకొనెను వేములవాడ భీమేశ్వరస్వామి మాహాత్మ్యమును తెలుపు నిట్టి గాథ లనేకము ప్రచారమందున్నవి చారిత్రకముగా నీ గాథలను విశ్వసించుట కవకాశములేదు

వేములవాడలో నెలకొనియున్న రాజరాజేశ్వరస్వామి భక్తజన పాలకుడు కోరిన కోరికల నిచ్చు కరుణామయుడు రాజేశ్వరస్వామి మాహాత్మ్యమును తెలుపు గాథలు ప్రజా బాహుళ్యమున వాడుకలో నున్నవి భారతావని యందీ రాజేశ్వర క్షేత్రము ప్రసిద్ధి గాంచినది

ఘూర్జర దేశమందున్న మహరాజ్ అను బ్రహ్మచారి బాల్యమునుండియే భక్తితత్వ మలవరచు కొనియుండెను అతడు ఐహిక సుఖముల నాకాంక్షింపక ఆధ్యాత్మిక చింతనాపరుడై తపో దీక్ష సాగించుట కనేక ప్రదేశములను వెదకెను దేశమందున్న అనేక పుణ్య స్థలములను చూచుచు వేముల వాడ కేతెంచెను అతడు వేములవాడలోనున్న కాలమునం దొకనాటి రాత్రి రాజేశ్వరస్వామి స్వప్నమున సాక్షాత్కరించి శివ పంచాక్షరి మంత్రోపదేశ మొనర్చెను బ్రహ్మచారి యగు మహరాజ్ సిద్ధుడై వాక్శుద్ధి కలిగి త్రికాలవేదియై కోరిన కోరికలను పొందు స్థితికి చేరెను వేల సంఖ్యలో భక్తులు రాజేశ్వరుని దర్శించి పూజాదికములు నిర్వహించిన పిదప మహరాజ్ సన్నిధి కేగి ఆయన ఆశీర్వాదములు పొందు చుండిరి

సిద్ధుడైయున్నను మహరాజ్ లోక కల్యాణార్థ మనేక సంతర్పణలు చేసెడివాడు. వేములవాడ యందున్న వైశ్య ప్రముఖులు ప్రతియేడు ఆషాఢ శుద్ధ పౌర్ణమినాడు మహాలక్ష్మి ఆలయమునకు వచ్చి అమ్మవారి కర్చనలుచేసి వందల కొలది భక్తులకు, దీనులకు, అనాథులకు, యాచకులకు అన్నదానము చేయుచుందురు ఈ ఆచారము నేటికిని పాటింపబడుచున్నది ఘూర్జర బ్రహ్మచారి మహారాజ్ జ్ఞాపకార్థ మట్టి సంతర్పణలు చేయుచుందురు.

పూనా, గణగపూర్ మహారాజ్‌లు, సీతారామ చంద్రయోగి వంటి మహనీయు లనేకులు వేములవాడ రాజరాజేశ్వరసామి నారాధించి తరించినారు రాజరాజేశ్వరస్వామి నారాధించినవారికి, భక్తి ప్రపత్తులతో పూజించిన వారికి కామితార్థములు సమకూరును

తెలంగాణమందు వేములవాడ రాజరాజేశ్వర క్షేత్ర మతి పవిత్రమైనదిగను, మహిమాన్విత మైనదిగను, భావింపబడుచున్నది అచటి ధర్మకుండ తోయము లతి పవిత్రమైనవి గంగా జలముతో సమానమైనవి దక్షిణ వారణాసిగా కీర్తింపబడుచున్న వేములవాడ క్షేత్రము అపర కైలాస మని భావింపవచ్చును

# భవిష్యోత్తర పురాణమందలి రాజేశ్వర క్షేత్రమాహాత్మ్య
# అర్చన శ్లోకములు

చంద్రావతంస మఖిలాండ పతిం దయాలుం
భస్మాంగరాగి కుసుమాయుధహారి నేత్రమ్ ।
నాగేంద్రహార నగరాజ సుతా సమేతం
ధ్యాయామి చిన్మయ మహం హృది రాజ లింగమ్॥

అద్యాతిపింగల జటాధరణం కృపాలుం
నాగేంద్ర చర్మకృత వాస సమబ్జపాణిమ్।
కర్పూర గౌరమభిరామ వృషాధి రూఢం
శ్రీ పార్వతీ రాజరాజేశ్వర దేవతాభ్యాం॥

పూర్ణ ప్రభేమహతి చిత్ర విచిత్రరూపే
వజ్రాది రత్న ఖచితే పుట హేమ యుక్తే।
రాజేశ్వరం గిరిసుతా సహితం సుఖేఽస్మిన్
సింహాసనేఽమరవిభుం సునివేశయామి॥

కర్పూర కుంకుమ సముజ్జ్వల గాంగతోయైః
పాద్యం మహేశ పదయో స్తవ కల్పయామి।
అంగీకురు ప్రమథనాథ మనోభిరామ
రాజేశ్వరీ హృదయ బాంధవ పాహిమాంత్వమ్॥

దుష్టాత్మ భీమతర దానవశైల వజ్రే
కల్పద్రు పల్లవ సమానకరాబ్జ యుగ్మే
అర్ఘ్యం దదామి వరదాయకతేగృహాణ
భాగీరథీష్ట సలిలైర్భవ రాజలింగ

యద్వీక్షణే నపులకాంచిత సర్వగాత్రీ
ఫుల్లారవింద నయనా నగరాజపుత్రీ।
విద్యావిలాసభవనాయత భాగ్యదాతః
సస్త్వం గృహాణజల మాచమనాయ శంభో॥

ఏలా లవంగ కణి కాలవ గంధితోయ
మానీత ముత్పల దలాంకిత రత్న కుంభైః
స్నానాయ గాంగమభిగృహ్యచ రాజలింగ
మాంపాహి పాహి శుభదైః కరుణాకటాక్షైః॥

మాణిక్య కాంచన విచిత్రిత మౌక్తికార్హా
ముద్యత్ప్రభాకర సహస్ర రుచి ప్రచారం
వస్త్రంహితే భగవతేఽద్య దదామి భక్త్యా
శ్రీ రాజలింగ శివ ధారయ సాద్రిజత్వం॥

యజ్ఞోపవీత మరవింద దలాయతాక్ష
శుభ్రం వినిర్మిత మిదం చఘ నోత్తరీయం
సుస్వీకురు ప్రణవ వత్త్రి వృతం శుభాంగం
దివ్యం త్రయీమయ జగన్మయ రాజలింగ॥

అర్ధేందు ఖండరుచిరే శివతే ఽలాటే
శ్రీ చందనేన రచితం తిలకం గృహాణ
కాశ్మీర సార కలితం విలసత్త్రి పుంద్రం
శ్రీ రాజలింగ కరుణాకర దీనబంధో॥

అక్షోభితాత్మ విభవాయ శుభాక్షతాంస్తే
దక్షాధ్వరాప కరణాయ సుచర్మభాసే
దత్తాన్వి భోఽమరపతేసు మనోభిరామా
నంగీకురు త్రిజగధీశ్వర రాజలింగ॥

నానావిధాని కుసుమానిమయా హృతాని
కల్హార పద్మకర వీర సుమాల్యకాని!
శర్వార్పయామి భగవంస్త ఉమా సహాయ
సద్యః ప్రసీదవరదో భవ రాజలింగ॥

సౌగంధి పుష్ప మకరంద భవం మనోజ్ఞం
ధూపం గృహాణ హరనిలగల స్మరారే!
శంభో మహేశ శశిశేఖర శూలపాణే
శ్రీ రాజలింగ మమదేహి సుమంగలాని

జ్యోతిర్మయం పరమ పావన గోఘృతార్ద్రి
వర్తిద్వయేన తమ సామపహారశోభం
దీపం సుకల్పితకలం సువిలోకయాశు
రాజేశ దీన శరణాగత వత్సలత్వం॥

దివ్యంచపాయస యుతం వరశాఖసూప
చోష్యాది యోగరుచిరం పరమాన్న మాజ్యం!
నైవేద్య మంబుజభవాది సురేంద్రవంద్య
పాదారవింద భవతె విని వేదయామి॥

ప్రక్షాలయామి విమలైస్సలిలై స్సురేశ
హస్తారవిందయుగలం తవ రాజలింగ
సాంబ ప్రసన్నరజనీకర బింబభాను
కంబు ప్రభైశ్చ ఘనసారల వైస్సుపూర్ణైః॥

కర్పూర పూగఫల మౌక్తికి చూర్ణయుక్తం
ఏలాపరీమలయుతం ఘనసార సారమ్।
తాంబూల మీశ్వర లవంగ మిశ్రితంతే
శ్రీరాజలింగ రుచిరం పరికల్పయామి॥

ఓంకార వాచ్యసకలాగమ వేద్య దేవ
బ్రహ్మాది సంస్తుత పదాబ్జ గృహాణశంభో।
యోగీశ్వరైస్సహసుమంత్ర విదాం వరేణ్యైః
శ్రీ రాజలింగ కుసుమాంజలి మర్పయామి॥

నిత్యం నమోఽస్తు మహతే శశిశేఖరాయ
శంభోశివేతి మనసా వచసా క్రియాభిః।
ధ్యాయామిమాం వృషభవాహన పాహి శంభో
శ్రీరాజలింగ వరదోభవ సుప్రసన్నః॥

బ్రహ్మాదయస్సురవరాస్సతతం నమంతి
ధ్యాయంతియం భువనపాలక మప్రమేయమ్
యోగీశ్వరాస్సురవరం కరుణాలవాలం
ధ్యాయామితం త్రిభువన పావన సచ్చరిత్రమ్।

# వేములవాడ చాళుక్యులు

ఆంధ్రదేశమున తెలంగాణ ప్రాంతమున సపాదలక్ష దేశమును పాలించిన రాజవంశీయులు వేములవాడ చాళుక్యులు పీరు బోధన్, గంగాధర, వేములవాడ పట్టణములను రాజధానులుగ పాలించి యుండిరి రాష్ట్రకూట చక్రవర్తుల సామంతులుగను, బంధువులుగను వీరు ప్రసిద్ధి గాంచిరి ఈ రాజ వంశీయులు కొంతకాలము స్వతంత్రులుగా పాలించిరి

వేములవాడ చాళుక్యులు జైన, శైవ మతములను ఆదరించి జైనతీర్థంకరులను, శైవాచార్యు లను గౌరవించి పోషించిరి వీరు జైనబసదులకు, జైనదేవాలయములకు, మఠములకు, శివాలయములకు, కవులకు, పండితులకు వేదవిదులైన విప్రులకు అగ్రహారముల నొసంగి తమ కీర్తిని శాశ్వతముగ నుండునట్లొనర్చినారు

వేములవాడ చాళుక్యుల పాలనా కాలము కన్నడ భాషకు స్వర్ణయుగము వంటిది ఈ వంశ మున గొప్ప వీరుడును, అరివీర భయంకరుడును, యుద్ధ విద్యా విశారదుడును నగు రెండవ అరికేసరి పంప మహాకవిని గౌరవించి ఆదరించి అగ్రహారము లొసంగి, అతనిచే విక్రమార్జున విజయ మహా కావ్యమును వ్రాయించెను

ఈ వంశీయులు క్రీ శ 7 వ శతాబ్ది ఉత్తరార్థము నుండి, పదునొకండవ శతాబ్ది పూర్వార్థము వరకు తెలంగాణ మండలి నిజామాబాదు, కరీంనగరము, ఆదిలాబాదు జిల్లాల ప్రాంతములను రాష్ట్ర కూట రాజుల సామంతులుగ పాలించిరి వీరి పరిపాలనము క్రీ శ 641 నుండి క్రీ శ 1052 వరకు సాగినది

రాష్ట్రకూట రాజ్యావిర్భావముతో వీరి అభ్యుదయ పరంపర ప్రారంభమై, కల్యాణీ చాళుక్య రాజ్యస్థాపనముతో అంతమైనది వేములవాడ చాళుక్యులు సుమారు 225 సంవత్సరము లవిచ్ఛిన్నముగా ఆంధ్రదేశమున సపాదలక్ష భూభాగము నేలుటవలన ఈ వంశీయుల చరిత్ర ఆంధ్రదేశ చరిత్రలో ప్రముఖ స్థాన మాక్రమించినది

వేములవాడ పూర్వము లేంబులవాడ యనబడినది శాసనములందు లేంబులవాడ శబ్దము ప్రయోగింపబడినది రాష్ట్రకూట రాజ్య మాపదలోనున్న సమయమున వేములవాడ చాళుక్యుల ప్రతిభా విశేషములచే నా రాజ్యము నాపదల నుండి యుద్ధరింపబడినది రాష్ట్రకూట రాజన్యు లొనర్చిన అనేక

సంగ్రామములందు ఈ రాజన్యులు పాల్గొని విజయములు సాధించినారు గొప్ప బలవంతులగుటవలన రాష్ట్రకూట చక్రవర్తులు వేములవాడ చాళుక్య రాజులతో సంబంధ బాంధవ్యము లేర్పరచుకొనినారు వైవాహిక బంధములవలన ఈ రెండు రాజవంశము లన్యోన్యముగ నుండి ఆనాటి దక్షిణాపథ రాజకీయములందు ప్రధాన పాత్ర వహించినవి

వేములవాడ చాళుక్యుల చరిత్ర రచనకు శాసనములు, సాహిత్య గ్రంథములు, శిల్పము, దేవాలయములు, మఠములు, సత్రములు,కట్టడములు,నిర్మాణములు, నాణెములు ముఖ్యమైన ఆధారములు

## శాసనములు:

వేములవాడ చాళుక్యులకు సంబంధించిన రెండు తామ్ర శాసనములు, 6 శిలాశాసనము లిప్పటివరకు లభించినవి

తామ్ర శాసనములు

1 మొదటి అరికేసరి కొల్లిపర తామ్ర శాసనము
2 మూడవ అరికేసరి పర్భిణి తామ్ర శాసనము

శిలా శాసనములు

1 కురవగట్టు శాసనము
2 రెండవ అరికేసరి కరీంనగర్ శాసనము.
3 రెంండవ అరికేసరి వేములవాడ శిలాశాసనము
4 జినవల్లభుని కుర్క్యాల శాసనము
5 క్రీ శ 946 నాటి కరీంనగర్ శాసనము
6 రెండవ అరికేసరి క్రీ శ 941 నాటి చెన్నూరు శిలా శాసనము

వేములవాడ చాళుక్య వంశమునకు మూలపురుషుడు సత్యాశ్రయ రణవిక్రముడు. అతని కుమారుడు పృథ్వీపతి మనుమడు మహారాజు

మహారాజు కుమారుడు రాజాదిత్యుడు రాజాదిత్యుని కుమారుడువినయాదిత్య యుద్ధమల్లుడు చరిత్ర ప్రసిద్ధి గన్నవాడు యుద్ధమల్లుని కిరువురు తనయులు అందు జ్యేష్ఠుడు మొదటి అరికేసరి కొల్లిపర తామ్ర శాసనము నొసంగినవాడు రెండవ తనయుడు బీరగృహుడు మహబూబునగర్ మండలము నాగర్‌కర్నూలు డివిజన్‌లోని కురువగట్టు శిలాశాసనమును ప్రకటించినవాడు.

రాష్ట్రకూట, కాకతీయ, చాళుక్య రాజవంశీయులకు సంబంధించిన శాసనములందు వేములవాడ చాళుక్యుల సమాచారమున్నది ఈ వంశీయులు వేయించిన శాసనములు, అన్య రాజ వంశీయుల శాసనములు వీరి చరిత్ర రచనలో తోడ్పడుచున్నవి

## సాహిత్యము - గ్రంథములు :

వేములవాడ చాళుక్య రాజులు సాహిత్య పోషకులు కన్నడ భాష వీరి కాలమున అభివృద్ధి చెందినది అనేక శాసనములు కన్నడ భాషలో వేయింపబడినవి. కన్నడ పద్య కవితలో మహా గ్రంథములు, కావ్యములు వెలసినవి

పంప మహాకవి, అతని సోదరుడు జినవల్లభుడు, జినవల్లభుని సహచరుడు మల్లియరేచన, సోమదేవసూరివంటి మహా కవులు, వేములవాడ చాళుక్యులు పాలించిన కాలమందుండిరి జినవల్లభుడు వేయించిన కుర్క్యాల శిలాశాసనము మూడు భాషలలోనున్నది తొలి తెలుగు కంద పద్యములం దున్నవి ఈ శాసనము సంస్కృతాంధ్ర కర్ణాటక భాషలలో వేయింపబడినది

పంప మహాకవి విక్రమార్జున విజయము, సోమదేవసూరి యశస్తిలక చంపువు లేక యశోధర చరిత్ర తదితర గ్రంథములు వేములవాడ చాళుక్యుల చరిత్ర రచనలో తోడ్పడుచున్నవి

ఈ గ్రంథములు జైనమత సంబంధమైనవైనను ఇందు వేములవాడ చాళుక్యుల కాలమునాటి మత, రాజకీయ, సామాజిక, ఆర్థిక, విద్యా విషయములను వెల్లడించుచున్నవి ఈ గ్రంథములే గాక వేములవాడ చాళుక్యులు వేయించిన తామ్ర, శిలాశాసనములు, అన్యరాజ వంశీయుల రాజ్యములందు రచింపబడిన గ్రంధములు వీరి చరిత్ర రచనకు తోడ్పడుచున్నవి

## శిల్పము :

వేములవాడ చాళుక్యుల కాలమున అనేక దేవాలయములు వెలిసినవి జైనమఠములు, జైనతీర్థంకరుల విగ్రహములు, జైనదేవాలయములు ఆనాటి శిల్పకళాభివృద్ధిని తెలిసికొనుటలో తోడ్పడును చాళుక్య, రాష్ట్రకూట శిల్పరీతులున్న అనేక దేవాలయములు వీరి కాలమున నిర్మింపబడినవి

బోధన్, వేములవాడ, చెన్నూరు, రేపాక, తదితర ప్రాంతములందున్న దేవాలయముల శిల్పము, జైన, శైవ మతములకు సంబంధించిన అపురూప విగ్రహములు, ఆలయ నిర్మాణరీతులు, ఆలయ కుడ్యములపై వెలసిన గాథా శిల్పములు, చిత్రములు వేములవాడ చాళుక్యుల నాటి శిల్పకళాభివృద్ధిని తెలిసికొనుటలో తోడ్పడును

## దేవాలయములు :

వేములవాడ చాళుక్యుల తొలి రాజధాని బోధన్ నగరము ఈ నగర మతిప్రాచీనతమ మైనది అశ్మక రాష్ట్రమునకు పోదననగరము రాజధానిగా వర్ధిల్లి యుండెను శాతవాహన సామ్రాజ్యము నెలకొల్పబడుటకు పూర్వము బోధన్ నగరము గణతంత్ర రాజ్యముగా నుండెను

బోధన్ నగరమందున్న జైన దేవాలయము లపురూపశిల్ప సౌందర్య విరాజితములు జైన తీర్థంకరుల ఎత్తైన విగ్రహము లతి మనోహరములు బోధన్ దుర్గము శిధిలమైనది దుర్గ ప్రాకార కుడ్యములు మాత్రము శిధిల రూపమున కనిపించుచున్నవి ఈ కోటలో నాలుగు జైన శాసనములు లభించినవి.

వేములవాడ చాళుక్య వంశపు తొలి రాజులు జైన మతానుయాయులు బోధన్ నగరమున జైనతీర్థంకరుల విగ్రము లనేకముగ నుండెను అందొక విగ్రహము 50' కన్న ఎత్తైనది ఆ విగ్రహము విరిగిపోయినది దాని మొండె మెన్ని వ్రక్కలైనదో తెలియదు కాని జైన తీర్థంకరుని విగ్రహము శిరస్సు మాత్రము బోధన్‌లోని రహదారి బంగళా ఆవరణములో పడియున్నది ఈ విగ్రహము నాదర్శముగా గొని కర్ణాటక రాష్ట్రమందలి శ్రావణ బెళగొళలోని విగ్రహము రూపొందింప బడినదని యందురు

వేములవాడలో జైన దేవాలయములు నిర్మింపబడినవి. అవి నేడు శివాలయముల రూపమున దర్శన మిచ్చుచున్నవి. జైనమతము క్షీణించి రాజాదరణము కోల్పోయిన పిదప ఇచటి జినాలయములు శివాలయములుగ మార్చబడినవి

కరీంనగర్ జిల్లాలోని గంగాధర గ్రామము, జినవల్లభుని కుర్క్యాల శాసనము చెక్కబడిన బొమ్మలమ్మ గుట్టకు చేరువలో నున్నది ఇది పూర్వము వేములవాడ చాళుక్యుల రాజధానిగా నున్న నగరము ఇచట అనేక జైన విగ్రహములు, దేవాలయ శిథిల చిహ్నములు కనుగొనబడినవి

వేములవాడలోని రాజరాజేశ్వర, భీమేశ్వర, బద్దెగేశ్వర, నకరేశ్వరాలయములు,బోధన్‌లోని శివాలయములు, దేవల్ మసీదు ఆనాటి శైవమత వ్యాప్తిని తెలుపును

## మఠములు - సత్రములు :

వేములవాడ చాళుక్యులు జైనమతానుయాయులు. వారి ఆస్థానము నలంకరించిన పంప మహాకవి, అతని సోదరుడు జినవల్లభుడు జైన మతావలంబులు. జైన మునులకు, జైనమత విద్యార్థులకు, జైన మతానుయాయులకు, తైర్థికులకు జినవల్లభుడు గంగాధర, కుర్క్యాల ప్రాంతమునందనేక బసతులను

సత్రములను, విద్యాలయములను నిర్మించెను అచట నొక బృహత్తటాకమును, అనేక జినాలయములను నిర్మించి, సత్రములందును, జైన బసతులందును, సమస్తమైన వసతులను కల్పించెను

బోధన్ నగరమం దనేక మఠములు, సత్రములు జినాలయములు ఆ కాలమున నిర్మింపబడిన ట్లచటనున్న శిథిలములవలన తెలియుచున్నది ఈ మఠములు సత్రములు, జినాలయములు వేములవాడ చాళుక్యుల ప్రజాహిత కార్యముల నెరుంగుటలో తోడ్పడుచున్నవి

## కట్టడములు - నిర్మాణములు :

రాష్ట్రకూట రాజ వంశీయుల సామంతులైన వేములవాడ చాళుక్యులు బోధన్‌లో నిర్మించిన కోట, అంతఃపురములు, రాజ భవనములు శిథిల రూపమున కనిపించుచున్నవి. జినవల్లభుడు నిర్మించిన మఠములు, జైనబసదులు, తటాకముల శిథిలములు కుర్క్యాల బొమ్మలమ్మ గుట్ట, ప్రాంతమున గంగాధర గ్రామమున కనిపించుచున్నవి వేములవాడ, తదితర ప్రాంతములందున్న శిథిలములు, శిథిలాలయములు, నేటికిని నిలిచియున్న తటాకములు వేములవాడ చాళుక్యుల నాటి నిర్మాణ కౌశలమును వెల్లడించుచున్నవి

## నాణెములు :

వేములవాడ చాళుక్యులు రాష్ట్రకూట రాజుల సామంతులు వీరి రాజ్యమున బాదామీచాళుక్య, రాష్ట్ర కూట రాజవంశీయుల నాణెములు వాడుకలో నుండెను. తెలంగాణమంతట బాదామీ, రాష్ట్రకూట రాజులు ప్రకటించిన నాణెములు చలామణిలో నుండెను

నాణెములు రాజుల పేర్లను, కాలమును, రాజ్య ఆర్థిక స్థితిని సూచించును మహబూబునగరము జిల్లా, నాగర కందనోలు, తాలూకాలోని కురువగట్టు శాసన మచటి శిథిలాలయ శిలాఫలకముపై చెక్కబడియున్నది. రాష్ట్రకూట కలివల్లభుని తనయుడు గోవింద వల్లభుడు. అతని మిత్రుడు, వేములవాడ చాళుక్య వినయాదిత్య యుద్ధమల్లుని ద్వితీయ పుత్రుడగు బీరగ్రహుడు. బీరగ్రహుని వీరకృత్యము లీ కురువగట్టు శాసనమం దభివర్ణింపబడినవి

రాష్ట్ర కూట నిరుపమ ధృవరాజుకు కలివల్లభుడను బిరుదమున్నది ఇతడు రాష్ట్ర కూట సామ్రాజ్యమును క్రీ శ 780 - 793 వరకు పాలించియుండెను

రాష్ట్ర కూట వంశమునకు వేములవాడ చాళుక్య వంశముతో సన్నిహిత సంబంధము లుండెను వైవాహిక సంబంధముల నీ రెండు రాజవంశములవా రేర్పరచుకొనుటయేగాక రాజులు యువమహారాజులు స్నేహితులుగా నుండిరి

## వేములవాడ చాళుక్య వంశము

(క్రీ. శ. 641 - క్రీ. శ. 1052)

సత్యాశ్రయ రణవిక్రముడు
(క్రీ శ. 641 - 660)

పృథ్వీపతి (660-695)

మహారాజు (695-725)

రాజాదిత్య పృథు విక్రముడు (725-750)

వినయాదిత్య యుద్ధమల్లుడు
(క్రీ. శ. 750-780)

- మొదటి అరికేసరి (క్రీ.శ. 780-800)
- బీరగ్రహుడు

(మొదటి అరికేసరి సంతతి:)

- మొదటి నరసింహుడు (రాజాదిత్య క్రీ.శ. 800-835)
- భద్రదేవుడు

రెండవ యుద్ధమల్లుడు
(క్రీ.శ. 835-870)

మొదటి బద్దిగడు
(క్రీ.శ. 870-895)

మూడవ యుద్ధమల్లుడు
(క్రీ.శ. 900-910)

రెండవ నరసింహ
(క్రీ శ 910-930)
|
రెండవ అరికేసరి (క్రీ.శ 930 - 955)
|
వాగరాజు (క్రీ శ 955 - 960) — రెండవ బద్దెగడు (క్రీ శ 960 - 966)

రెండవ బద్దెగడు (క్రీ శ 960 - 966)
|
మూడవ అరికేసరి
(క్రీ శ 966 - 973)
|
×
|
భద్రగుడు
(క్రీ శ 1052)

మొదటి అరికేసరి, రామడుగు విషయములోని బెల్మొగ గ్రామమును ముగ్ధశివాచార్యునకు విద్యాదాన నిమిత్త మొసంగెను ముగ్ధశివాచార్యుడు సద్యశ్శివాచార్యుని శిష్యుడు మొదటి అరికేసరి కొల్లిపరతామ్ర శాసనము కల్యబ్దము 4121 లో వేయించినట్లున్నది కల్యబ్దము 4121 క్రీ శ 1020 కి సమానము కావున ఈ శాసన కాలము తప్పుగా చెక్కబడినదని భావింపవచ్చును రెండవ అరికేసరి చెన్నూరు అగస్త్యేశ్వరాలయ శాసనము క్రీ శ 941 నాటిది. కావున కొల్లిపర శాసన మంతకు చాలా యేండ్లకు పూర్వమే ఇవ్వబడినదని తెలియుచున్నది

విక్రమార్జున విజయము, రెండవ అరికేసరి వేములవాడ శిలాశాసనము, మూడవ అరికేసరి పర్భిణి తామ్ర శాసనములందు పేర్కొనబడిన వేములవాడ చాళుక్య వంశావళి ఒకేవిధముగ కనిపించుచున్నది

వినయాదిత్య యుద్ధమల్లుడు, మొదటి అరికేసరి, రాజాదిత్య బిరుదాంచితుడగు మొదటి నరసింహవర్మ, రెండవ యుద్ధమల్లుడు, బద్దెగ, మూడవ యుద్ధమల్లుడు, రెండవ నరసింహవర్మ, రెండవ అరికేసరి, భద్రదేవుడు, మూడవ అరికేసరి వరుసగా విక్రమార్జున విజయము, వేములవాడ, పర్భిణి శాసనములందు పేర్కొనబడినారు

విజయాదిత్య యుద్ధమల్లుని రెండవ కుమారుడు బీరగృహుడు మొదటి అరికేసరి ండవ కుమారుడు భద్రదేవుడు. రెండవ అరికేసరి జ్యేష్ఠ పుత్రుడు వాగరాజని యశస్తిలక చంపువు తెలుపు చున్నది

క్రీ శ 780 నుండి 793 వరకు నిరుపమ ధృవుడు రాష్ట్రకూట రాజ్యమును పాలించెను ఇతడు కలివల్లభ బిరుదాంచితుడు బీరగృహుడు యువరాజు స్నేహితుడు కావున వినయాదిత్య యుద్ధ మల్లుని పాలనా కాలము క్రీ శ 750-780

మొదటి అరికేసరి నిరుపమ ధృవుని కాలమువాడు కావున ఇతని పాలనా కాలము క్రీ శ 793-814

రెండవ అరికేసరి శక సంవత్సరము 863 లే క్రీ శ 941 లో ఆదిలాబాదు జిల్లాలోని చెన్నూరు గ్రామమందున్న అగస్త్యేశ్వరాలయమునం దొక శాసనమును వేయించెను ఇతడు రాష్ట్ర కూట, అకాలవర్ష మూడవ కృష్ణుని సామంతుడు.

కురువగట్టు, చెన్నూరు శాసనముల మధ్యకాలము 150 సంవత్సరములు ఈ మధ్యకాలమున వేములవాడ చాళుక్యరాజ్యమును మొదటి నరసింహ వర్మ, రెండవ యుద్ధమల్లుడు, బద్దెగడు, మూడవ యుద్ధమల్లుడు, రెండవ నరసింహవర్మలు పాలించి యుండిరి బద్దెగడు వేంగి ప్రభువులగు గుణగ విజయాదిత్య, మొదటి చాళుక్య భీముల సమకాలికుడు బద్దెగుని పాలనాకాలము క్రీ శ. 870-895.

బద్దెగుని పౌత్రుడు రెండవ నరసింహ వర్మ రాష్ట్రకూట మూడవ ఇంద్ర వల్లభుని సోదరి యగు జాకవ్వను వివాహమాడెను ఈ దంపతుల తనయుడు వేములవాడ చాళుక్య రాజులలో ప్రసిద్ధి గాంచిన రెండవ అరికేసరి

రెండవ అరికేసరి బాల్యమున రాష్ట్రకూటరాజ్యమున మేనమామ ఇంద్రవల్లభుని చెంతనుండి విద్యాబుద్ధులు నేర్చి, అతని తనయ యగు రేవకను వివాహమాడెను ఇతని పాలనాకాలము క్రీ. శ 930 నుండి 955

రెండవ అరికేసరి తనయుడు వాగరాజు ఇతడు గంగాధర పట్టణమును రాజధానిగా క్రీ శ. 955 నుండి 965 వరకు వేములవాడ చాళుక్య రాజ్యము నేలెను. ఇతని సోదరుడు భద్రదేవుడు

భద్రదేవుని కుమారుడు మూడవ అరికేసరి ఇతడు శ సం 888 లేక క్రీ శ 966 లో పర్భిణి తామ్రశాసనమును వేయించెను సోమదేవ పండితునికి దానమిచ్చు సందర్భమునం దీ శాసనము ప్రకటింపబడినది మూడవ అరికేసరి పరిపాలనము క్రీ శ 965 నుండి 973 వరకు సాగినది

వేములవాడ చాళుక్యులు బాదామీ చాళుక్య వంశీయులకు జ్ఞాతివర్గములోనివారు అందు సత్యాశ్రయ రణవిక్రముడు రెండవ పులకేశికి గాని మొదటి విక్రమాదిత్యునకుగాని సన్నిహితుడు కావచ్చును కాని బాదామీ చాళుక్యులు చంద్రవంశజులు పర్భిణీతామ్ర శాసనానుసారము వేములవాడ చాళుక్యులు సూర్యవంశజులని తెలియుచున్నది

ఈ వంశీయుల ఆభిజాత్యమెట్లున్నను సత్యాశ్రయ రణవిక్రముడు రెండవ పులకేశి చక్రవర్తి వలననో, లేక అతని తనయుడగు మొదటి విక్రమాదిత్యుని వలననో మహాసామంతాధిపతిగా నియమింపబడి బోధన్ ప్రాంతమును పాలించియుండును ఈ వంశమును స్థాపించినవాడు సత్యాశ్రయ రణవిక్రముడని భావించుట కవకాశమున్నది

వినయాదిత్య యుద్ధమల్లుని నుండి మూడవ అరికేసరివరకు గల వేములవాడ చాళుక్య రాజుల పాలనాకాలమును చారిత్రికులు నిర్ణయించినారు ఈ వంశీయులకు సంబంధించిన శాసనములు, విక్రమార్జున విజయము, తదితర సాహిత్య గ్రంథముల ననుసరించి చారిత్రికులు కాల నిర్ణయమును గావించినారు

వేములవాడ చాళుక్య రాజ్యము నేలిన రాజుల సంక్షిప్త చరిత్ర నిచట వ్రాయబడుచున్నది.

## సత్యాశ్రయ రణవిక్రముడు :

బాదామీ చాళుక్య చక్రవర్తి రెండవ పులకేశి వింధ్యపర్వతములకు దక్షిణమందున్న ప్రాంతములను పాలించుచు అనేక రాజ్యములను జయించి, విశాల సామ్రాజ్యమును స్థాపించెను అతని సామంత మాండలికులలో సత్యాశ్రయ బిరుదాంచితుడగు రణవిక్రము డొకడు

రెండవ పులకేశికి సత్యాశ్రయ బిరుదమున్నది రెండవ పులకేశి శత్రువులతో పోరాడి రణవిక్రముడు విజయములు సాధించియుండును పల్లవులతోను, తూర్పున కాళింగులతోను, పిఠాపుర వరాధీశులతోను సంభవించిన సంగ్రామములందు రణ విక్రముడు పులకేశి ప్రభువునకు విజయములు చేకూర్చి సత్యాశ్రయ బిరుదమును బడసియుండును

రెండవ పులకేశి రణవిక్రముని ప్రతాపాతిశయములను గమనించి అతనికి సపాదలక్ష దేశ పాలనా బాధ్యత నప్పగించియుండును బోధన్ నగరమును కేంద్రముగా రణవిక్రముడు ఇందూరు, కరీంనగర్ మండలములను పాలించియుండును క్రీ శ 610 నుండి క్రీ శ 642 వరకు రెండవ పులకేశి బాదామీ చాళుక్య రాజ్యమును పాలించెను అతని కాలమందు రణవిక్రముడు బోధన్ ప్రాంతము

నేలుచు చాళుక్య ప్రభువులకు విధేయ సామంతునిగ నుండెను ఇతని పరిపాలనము క్రీ శ 641 నుండి 660 వరకు సుమారు 20 సంవత్సరములు సాగినది పులకేశి జ్యేష్ఠ కుమారుడు మొదటి విక్రమాదిత్యుని పాలనాకాలమందును సత్యాశ్రయ రణవిక్రముడు బోధన్ రాజ్యపాలకునిగ నుండెను

బాదామీ చాళుక్య వంశజుల విధేయ సామంతునిగ సత్యాశ్రయ రణవిక్రముడు పేరొ వహించి సాటి సామంత రాజులలో మేటి యనిపించుకొనెను

**పృథ్వీపతి :**

సత్యాశ్రయ రణ విక్రముడు క్రీ శ 660 లో దివంగతుడు కాగా అతని తనయుడు పృథ్వీపతి వేములవాడ రాజ్య సింహాసన మధిష్ఠించెను

బాదామీ చాళుక్య వంశమున మహావీరుడగు రెండవ పులకేశి క్రీ శ 642 లో దివంగతుడు కాగా అతని తనయులు సింహాసనమునకై తగవులాడిరి రెండవ పులకేశి కైదుగురు తనయులు అందు ఆదిత్యవర్మ జ్యేష్ఠుడు రెండవవాడు చంద్రాదిత్యుడు మూడవ తనయుడు రణరాగుడు నాల్గవవాడు మొదటి విక్రమాదిత్యుడు ఐదవ కుమారుడు జయసింహుడు

అన్నలు ముగ్గురు రాజ్య పీఠము నాక్రమించుటకు పరస్పరము కలహించు చుండుట గమనించిన మొదటి విక్రమాదిత్యుడు, వేములవాడ రాజ్యపాలకుడగు రణవిక్రముని, అతని తనయుడగు పృథ్వీపతి సహాయమున సోదరుల నెదిర్చి ద్వాదశ వర్షములు పోరాడి, చివరకు క్రీ శ. 655 లో బాదామీ నగరము నాక్రమించి చాళుక్య సింహాసన మధిష్టించెను

రెండవ పులకేశి యనంతరము అతని పెద్దకొడుకు క్రీ శ 642 లో రాజై 645 వరకు మాత్రమే పాలించెను అతని సోదరుడు చంద్రాదిత్యుడు క్రీ శ 645 లో బాదామీ సింహాసన మాక్రమించి క్రీ శ 647 వర కేలెను అటు పిమ్మట, అతని సోదరుడు రణరాగుడు క్రీ శ 649 లో అన్నను తొలగించి రాజయ్యెను

సత్యాశ్రయ రణవిక్రముని సహాయమున సింహాసనాధిష్ఠుడైన మొదటి విక్రమాదిత్యుడు బొధన్ సపాద లక్ష దేశ పాలనా బాధ్యతకు తోడుగా బాదామీ చాళుక్య సైన్యమున సేనా నాయక పదవిని అతని కప్పగించెను

మొదటి విక్రమాదిత్యుని 26 సంవత్సరముల పరిపాలనమున అతనికి సత్యాశ్రయ రణ విక్రముడు, అతని తనయుడు పృథ్వీపతి అన్ని విధముల సహకరించియుండిరి

మొదటి విక్రమాదిత్యుడు పల్లవ రాజ్యముపై దండయాత్రలు నిర్వహించిన సమయమందును, ఉత్తర దేశ దండయాత్రల యందును పృథ్వీపతి పాల్గొని, విజయములు సాధించుటలో తోడ్పడియుండును

పృథ్వీపతి బోధన్ సపాద లక్ష రాజ్యము నతి సమర్థవంతముగ పాలించెను బాదామీ చాళుక్య ప్రభువులకు విధేయ సామంతునిగ నుండి, క్రీ శ 660 నుండి 695 వరకు సుమారు 35 సంవత్సరము లేలెను

**మహారాజు :**

బోధన్ మహా సామంత రాజ్యమును పాలించిన పృథ్వీపతి యనంతర మాతని కుమారుడు మహారాజు క్రీ.శ 695 లో సింహాసన మధిష్ఠించెను, ఇతడు బాదామీ చాళుక్య చక్రవర్తి యగు వినయాదిత్యుని కాలమందును, అతని తనయుడగు విజయాదిత్యుని కాలమందును మహా సామంతాధిపత్యము వహించి, బోధన్ సపాదలక్ష దేశము నేలెను

మహారాజు విజయాదిత్యుని పాలనాకాలమున పల్లవరాజులలో సంభవించిన యుద్ధములందు పాల్గొని విజయములు గాంచుటలో తోడ్పడెను వినయాదిత్యుని తనయుడు రెండవ విక్రమాదిత్యుడు గొప్ప పరాక్రమవంతుడు, మహారాజు విక్రమాదిత్యుని వెంటనుండి సైన్యములను నడిపి విజయ సాధనలో తోడ్పడి యుండును

మహారాజు బోధన్ మహా సామంత రాజ్యమును క్రీ శ 695 నుండి 725 వరకు సుమారు 30 సంవత్సరములు పాలించెను

**రాజాదిత్య పృథు విక్రముడు :**

మహారాజు తరువాత అతని కుమారుడు రాజాదిత్యుడు బోధన్ సామంత రాజ్య పీఠమును క్రీ శ 725 లో అధిష్టించెను ఇతడు బాదామీ చాళుక్య విజయాదిత్య, రెండవ విక్రమాదిత్యుల విధేయ సామంతునిగ నుండెను

క్రీ శ 739 లో అరబ్బులు సింధు, గుజరాతు ప్రాంతముల నాక్రమించి స్థిరపడి రాజ్యమును స్థాపించుటకు యత్నించిరి బాదామీ చాళుక్య చక్రవర్తి రెండవ విక్రమాదిత్యుడు రాజాదిత్య పృథు విక్రముని సహాయమున అరబ్బుల నెదుర్కొని జయించి, వారి నా ప్రాంతముల నుండి తరిమివేసెను

రెండవ విక్రమాదిత్యుడు పల్లవ రాజ్యముపై నిర్వహించిన దండయాత్రలందు రాజాదిత్య పృథు విక్రముడు పాల్గొని చక్రవర్తికి సహాయసహకారము లందించి అతని మన్ననలు పొందియుండును రాజాదిత్య పృథు విక్రముని పాలనాకాలము క్రీ శ 725-750

వేములవాడ చాళుక్యుల తొలి రాజధాని బోధను రెండవ అరికేసరి కాలమునాటికి వీరి రాజధాని వేములవాడకు మార్చబడినది దీనికి కారణము ఈ సామంత చాళుక్య రాజ్యము గోదావరి నదికి ఉత్తరముననున్న చెన్నూరు వరకు విస్తరించుటయే పరిపాలనా సౌలభ్యమునకు రాజధాని రాజ్యము మధ్య ప్రాంతమందుండుట శ్రేయస్కరమని భావించి అరికేసరి మహారాజు తన రాజధానిని వేములవాడకు మార్చి యుండును

పూర్వము బోధను నగర మశ్మక రాష్ట్రమునకు రాజధానిగా వర్ధిల్లి యుండెను 125000 బంగారు నాణెముల ఆదాయము గల రాజ్య భాగము సపాదలక్ష దేశ మనబడినది గోదావరి నదికి దక్షిణమున మంజీరానదినుండి మహా కాళేశ్వర పర్యంతము వ్యాపించియున్న భూభాగము పోదననాడని వ్యవహరింపబడినది ఇదియే సపాదలక్షదేశము వేములవాడ చాళుక్యుల పాలనలో నున్న రాజ్యము తరువాతి కాలమున కరీంనగర మండలము సబ్బినాడనియు, సబ్బిసాయిర మండలమనియు వ్యవహృతమైనది

## వినయాదిత్య యుద్ధమల్లుడు :

రాజాదిత్య పృథు విక్రముని తనయుడు వినయాదిత్య యుద్ధమల్లుడు తండ్రి యనంతరము క్రీ శ 750 లో చాళుక్య సామంత రాజ్య సింహాసనమును బోధన్ నగరమున అధిష్ఠించెను. కొల్లిపర తామ్ర శాసన మితని విజయములను అభ్యుదయ పరంపరను వెల్లడించుచున్నది

తురుష్క, యవన, కాంభోజ, కాశ్మీర, నేపాళ, మాళవ, మగధ, కళింగాదిదేశముల నితడు జయించినట్లు కొల్లిపర తామ్ర శాసనమందున్నది

సపాద లక్ష దేశమును పాలించుచు, పోతన నగరమున తైలపూరిత వాపీ కూపములందు ఏనుగులను స్నానమాడించి, చిత్రకూట దుర్గమును, వినయాదిత్య యుద్ధమల్లుడు జయించినట్లు కొల్లిపర శాసనము తెలుపుచున్నది

సపాద లక్ష భూమి అనగా లక్ష పాతిక వేల సువర్ణముల ఆదాయము వచ్చు భూమి అని అర్థము ఆ కాలమున భారత దేశమున నేపాల్, కేదారము, కనోజి, కాశ్మీరము, కళింగములోని కొన్ని ప్రాంతములు సపాద లక్ష దేశములుగా పిలువబడినవి.[1]

---

1 పండితారాధ్య చరిత్రము-పాల్కురికి సోమనాథ ప్రణీతము

అశ్మక రాష్ట్రము నేటి పోతన లేక బోధన్ నగరము కేంద్రముగా గలది అనాడు సపాద లక్ష భూమిగా వ్యవహరింపబడినది వినయాదిత్య యుద్ధమల్లుడు తురుష్క,యవన, కాంభోజ, కాశ్మీరాది దేశములను జయించెననుట హాస్యాస్పదము

రాష్ట్రకూట దంతిదుర్గుని సామంతునిగా, సేనానిగా నిత డాతడొనర్చిన యుద్ధములందు పాల్గొని, విజయము సాధించుటలో తోడ్పడియుండును మొదటి అరికేసరి తనకు జన్మ నిచ్చిన తండ్రియగు వినయాదిత్య యుద్ధమల్లుని తాను వేయించిన శాసనమున గొప్పగా కీర్తించి యుండెనని భావింపవచ్చును

వినయాదిత్య యుద్ధమల్లుని కధికముగా గజ సైన్యముండెనని పంప మహాకవి రచించిన విక్రమార్జున విజయమువలన తెలియుచున్నది రాష్ట్రకూట దంతిదుర్గునికి బాదామీ చాళుక్య రాజ్యమును కూలద్రోయుటలోను రాష్ట్రకూట రాజ్య స్థాపనములోను సామంతుడగు వినయాదిత్య యుద్ధమల్లుడు తోడ్పడి అతని వలన మహా సామంత పదవితోటు సపాదలక్ష భూమిని పొంది బోధన్ నగరము రాజధానిగా వేములవాడ రాజ్యమును పాలించి యుండును

క్రీ శ 755 లో దంతివర్మ చాళుక్య ప్రభువగు రెండవ కీర్తివర్మ నోడించి బాదామీ రాజ్యము నాక్రమించుటలో వినయాదిత్య యుద్ధమల్లుని సహకారమును పొందెను రాష్ట్రకూట దంతి వర్మ లేక దంతిదుర్గ డసాధారణ బలసంపన్నుడు ఇతడు తన సమీప బంధువగు చాళుక్యవినయాదిత్య యుద్ధమల్లుని సహాయమున క్రీ శ 757-758వ సంవత్సరములందు విజయయాత్రకు బయలుదేరి కాంచి, కళింగ, కోసల, శ్రీశైల, మాళవ, లాట, సింధు దేశములను జయించెను. ఈ విజయములనే వినయాదిత్య యుద్ధమల్లుడు పొందినట్లాతని తనయుడు శాసనమున పేర్కొనెను వినయాదిత్య యుద్ధమల్లుని పాలనాకాలము క్రీ శ 750-780

## మొదటి అరికేసరి :

వినయాదిత్య యుద్ధమల్లుని తరువాత అతని జ్యేష్ఠ కుమారుడు మొదటి అరికేసరి క్రీ శ 780 లో చాళుక్య సామంత రాజ్యాధిపతి యయ్యెను రాష్ట్ర కూట రాజ్యమునం దాతరుణమున అంతః కలహములు బయలుదేరెను రాష్ట్రకూట నిరుపమధ్రువుడు కవివల్లభ బిరుదాంచితుడు అతడు తన అన్నయగు రెండవ గోవిందునితో యుద్ధ మొనర్చి రాజ్య సింహాసన మాక్రమించెను

రాష్ట్రకూట దంతివర్మ క్రీ శ 758 లో మరణించెను అతనికి పుత్ర సంతతి లేనందున అతని పినతండ్రి అకాలవర్షుడు క్రీ శ 758లో రాజై, 772 వరకు రాష్ట్రకూట రాజ్యము నేలెను

అకాలవర్షునికి ఇరువురు తనయులు అందు జ్యేష్ఠుడు రెండవ గోవింద వల్లభుడు ప్రభూత వర్ష బిరుదాంచితుడు అతడు క్రీ శ 772 నుండి 780 వరకు పాలించెను ధ్రువరాజీతని తమ్ముడు సోదరుని రాజ్యభ్రష్టుని గావించి క్రీ శ 780 లో నిరుపమ బిరుదము వహించి రాష్ట్రకూట సింహాసన మధిష్టించెను

రెండవ గోవిందునికి వేంగీ చాళుక్య రాజగు నాల్గవ విష్ణువర్ధనుడు సహాయపడెను కాని ధ్రువరాజుకే విజయము లభించెను ధ్రువరాజు రాజ్యపీఠ మలంకరించిన పిదప వేంగీ విష్ణువర్ధనుడు తన సోదరునికి సహాయపడినాడను కోపమున నతనిని శిక్షించుటకు వేములవాడ చాళుక్య మొదటి అరికేసరికి సైన్యమిచ్చి పంపించెను రాష్ట్రకూట సైన్యమునకు వేంగి విష్ణువర్ధనుని సైన్యముతో సంకుల సమర మేర్పడెను ఆ యుద్ధమున మొదటి అరికేసరి వీరవిహార మొనర్చి వేంగీ సైన్యమును చెల్లాచెదురు చేసి యుద్ధరంగమున విష్ణువర్ధనుని యోడించెను

వేంగీ వల్లభుడు రాష్ట్రకూటులతో సంధి యొనర్చుకొనెను సంధి ప్రకార మతడు తన కుమార్తె శీల మహాదేవిని రాష్ట్రకూట రాజ్యాధిపతి యగు ధ్రువున కిచ్చి వివాహ మొనర్చెను.

ఈ వైవాహిక సంబంధము వలన వేంగీ చాళుక్యులు, రాష్ట్రకూట రాజన్యులు సఖ్యముగా నుండు అవకాశ మేర్పడినది

రెండవ అరికేసరి వేములవాడ శిలా శాసనము, విక్రమార్జున విజయము మొదటి అరికేసరి వేంగీ దేశ విజయమును తెలుపుచున్నవి ఈ విజయమును పురస్కరించుకొని రాష్ట్రకూట నిరుపమ ధ్రువరాజు మొదటి అరికేసరికి, నేటి మహబూబునగరము జిల్లాలోని నాగరకందనోలు, జడ్చర్ల మొదలు నల్లగొండ మండలమందున్న రామడుగు విషయము వరకు గల భూభాగమును కానుకగా నొసంగెను

మొదటి అరికేసరి రాష్ట్రకూట సైన్యముల కాధిపత్యము వహించి, నల్లగొండ మండలము నధిగమించి వేంగీ దేశముపై దండెత్తి యుండెను యుద్ధ విజయానంతర మతడు ధ్రువరాజు అనుగ్రహ మున పొందిన రాజ్య భాగమును దర్శించెను పావన కృష్ణా నదీ తీరమందున్న ఏలేశ్వర మహా క్షేత్రమును దర్శించి ఏలేశ్వరస్వామి నర్చించి, అచటనున్న కాలాముఖ శైవాచార్యుడగు సద్యశ్శివా చార్యుని భ్రాతుడగు ముగ్ధ శివాచార్యునికి రామడుగు విషయములోని బెల్మొగ గ్రామమును విద్యా దానముగ నొసంగుచు కొల్లిపర శాసనమును వేయించెను

ఏలేశ్వరము సుప్రసిద్ధ శైవ క్షేత్రము ఇచట వేద విద్యా పారంగతులైన మహామహిమాన్వితులైన పండితులుండిరి ఏలేశ్వర విద్యా పీఠాధిపతి ఏలేశ్వరోపాధ్యాయుడు. ఈ పీఠమునకు పారంపర్యముగా గురువులు నియమింపబడుచుండిరి వారందరు ఏలేశ్వరోపాధ్యాయులుగ వ్యవహరింపబడినవారే ఈ ప్రాంతమున వేదములు, వేదాంగములు, ఉపనిషత్తులు, షడ్దర్శనములు, కావ్య నాటకాలంకార వ్యాకరణశాస్త్రములు, వేదాంత, తత్త్వమీమాంసశాస్త్రములు బోధింపబడుచుండెను అట్టి మహా విద్యా పీఠమును నిర్వహించు ముగ్ధశివాచార్యునకు మొదటి అరికేసరి బెల్మొగ గ్రామము నగ్రహారముగ నొసంగెను

కరీంనగర్, నిజామాబాదు జిల్లాలలో రామడుగు పేరు గల గ్రామములున్నవి నల్లగొండ జిల్లాలోని నిడుమానూరుకు సమీపమందొక రామడుగు గ్రామమున్నది కొల్లిపర తామ్ర శాసనమున బెల్మొగ గ్రామ సరిహద్దులను పేర్కొనినపుడు ఊరిగె, తువతోఱు, పరివాతుర్ల, పుల్చెఱువు, పోతునోదపి అను గ్రామములు తెలుపబడినవి

ఇందు ఊరిగె = ఊరియ = పెద్దవూర గ్రామముగా భావింపవచ్చును పెద్దవూర శాసనములందా గ్రామము ఊరియగా పేర్కొనబడినది

రామడుగు = పెద్ద వూర సమితిలో నుండెడిది మండల వ్యవస్థ యేర్పడిన పిదప నది హాలియా మండలమున కనుసంధింపబడినది అహల్యానదీ తీరమందున్న ఈ గ్రామమున ప్రసిద్ధమైన రామాలయమున్నది

శాసనమున పేర్కొనబడిన-
పరివాతుర్ల = పరివేదుల గ్రామము
పోతునోదుడి = పోతునూరు
పుల్చెఱువు = పులిచెర్ల
తురతోఱు = శిథిలమైనది.

ఈ గ్రామములు పెద్దవూర మండల ప్రజా పరిషత్తు పరిధిలోను, పెద్ద అడిశర్లపల్లి మండల పరిధిలోను ఉన్నవి

మొదటి అరికేసరి సోదరుడు భీరగృహుడు జడ్చర్ల తాలూకాలోని కురువగట్టు శాసనమున పేర్కొనబడినాడు. జడ్చర్ల, నాగర్‌కర్నూలు, దేవరకొండ, పెద్దవూర, కల్వకుర్తి ప్రాంతములు కొంత కాలము వేములవాడ చాళుక్యుల పాలనములో నుండెనని భావింపవచ్చును

జడ్చర్లకు సమీపమున గంగాపురమున్నది ఈ పట్టణము బాదామి చాళుక్య చక్రవర్తులకు, అటు పిమ్మట రాష్ట్రకూట రాజవంశీయులకు ప్రధాన సైనిక నగరముగా నుండెను ఇచట ఈ వంశీయుల సామంతుడు నివసించుచుండెను గంగాపురమునకు దగ్గరలోనున్న గుట్టుపైన పాదేశ్వరి ఆలయము ముందీ శాసన శిలమున్నది వేములవాడ చాళుక్య వినయాదిత్యుని తనయుడు బిరిగ్రహుడు, రాష్ట్రకూట కలివల్లభుని తనయుడు గోవింద వల్లభుడు స్నేహితులు వారు అనేక రాజ్యములపై దండెత్తి శత్రురాజులను సంహరించి తమ సాహసమును శాశ్వత మొనర్చుకొనిరి ఈ విషయము కురువగట్టు శాసనమున తెలుపబడినది రాష్ట్రకూట ధ్రువరాజుకు కలివల్లభుడను బిరుదమున్నది

పెద్దపూరకు సమీప గ్రామములందు రాష్ట్రకూటులకు, బాదామి చాళుక్యులకు సంబంధించిన అనేక శిలా శాసనములున్నవి అహల్యా నదీ తీరమందనేక పుణ్య క్షేత్రములున్నవి హాల్యా లేక అనుముల మండల పరిధిలో పెరూరు గ్రామమున్నది ఇచటి సోమేశ్వరాలయ మతి ప్రసిద్ధి గన్నట్టిది పెరూరుకు చేరువలో అహల్యానది కృష్ణానదిలో సంగమించుచున్నది పూర్వ మీ ప్రాంతము వ్యాపార కూడలిగ నుండెను దేశ విదేశ వ్యాపారులు పెరూరులో నివసించి, విశేష వ్యాపార మొనర్చుచుండిరి.

పెరూరు నుండి నావలు బయలుదేరి నదిలో పయనించి, అగాధ సముద్రమును చేరి అచటి నుండి తూర్పు దేశములగు జావా, సుమత్రా, బోర్నియో, సయాం మున్నగు ప్రాంతములకు వెళ్ళుచుండెను. విదేశ వర్తకులు, స్వదేశ వర్తకులు, స్వరాష్ట్ర, పార రాష్ట్రిక వ్యాపారులు పెరూరులో నివసించు చుండిరి పెరూరు, పెద్దపూర, జడ్చర్ల ప్రాంతములు వేములవాడ చాళుక్యుల పరిపాలనలోనికి వచ్చుట వలననే మొదటి అరికేసరి ఆ ప్రాంతమునందున్న బెల్మొగి గ్రామము నగ్రహారముగ నిచ్చియుండెను మొదటి అరికేసరి విద్వాంసుడు గజతంత్ర విద్య, ధనుర్విద్య, ఆయుర్వేద విద్యల నభ్యసించినవాడు. సమస్తలోకాశ్రయ, త్రిభువనమల్ల, రాజ త్రినేత్ర, సాహస రామాది బిరుదములు గలవాడు వేములవాడ రాజ్యము నితడు క్రీ శ 780 నుండి 800 వరకు అతి వైభవోపేతముగ పాలించెను

## మొదటి నరసింహుడు :

మొదటి అరికేసరి కిరువురు కుమారులు అందు జ్యేష్ఠుడు మొదటి నరసింహుడు రెండవవాడు భద్రదేవుడు తండ్రి మరణానంతరము మొదటి నరసింహుడు క్రీ శ 800 లో వేములవాడ చాళుక్య రాజ్య సింహాసన మధిష్టించెను ఇతడు ప్రకటించిన శాసనములు లభించలేదు కాని రాష్ట్రకూట మూడవ గోవిందుని సామంతునిగానుండి నతడొనర్చిన యుద్ధములందు మొదటి నరసింహుడు పాల్గొని యుండును.

రాష్ట్రకూట మూడవ గోవిందుడు యుద్ధ విద్యా విశారదుడు పల్లవ, పశ్చిమ గాంగ, తూర్పు చాళుక్య, ఘూర్జర, ప్రతీహార, పాలాది రాజన్యులతో పోరు సలిపి విజయములు సాధించెను తూర్పు చాళుక్య ప్రభువు నరేంద్ర మృగరాజు అతని సోదరుడు భీమసలికి నరేంద్ర మృగరాజును రాజ్యభ్రష్టుని గావింపదలచి భీమసలికి రాష్ట్రకూట మూడవ గోవిందు నాశ్రయించెను రాష్ట్రకూట సైన్యమున అనేక వీరులుండిరి వేములవాడ చాళుక్య మొదటి నరసింహుడు, చక్రవర్తి ఆదేశముపై సైన్యయుతుడై వేంగీ దండయాత్ర యందు పాల్గొనెను రాష్ట్రకూట సైన్యమునకు విజయము కలిగెను

మొదటి నరసింహుడు మూడవ గోవిందుని తరువాత, అతని తనయుడగు మొదటి అమోఘ వర్షునికి బదులుగా రాజ్య పాలన మొనర్చిన కనకసువర్ణవర్షుని సామంతునిగనుండి వేములవాడ రాజ్యమును పాలించెను ఇతడు మొదటి అరికేసరివంటి సమర్థుడుకాడు విధేయ సామంతునిగా నితడు క్రీ శ 800 నుండి 835 వరకు రాజ్యమేలెను

## రెండవ యుద్ధమల్లుడు :

మొదటి నరసింహవర్మ తరువాత అతని కుమారుడు రెండవ యుద్ధమల్లుడు క్రీ శ 835 లో వేములవాడ చాళుక్య రాజ్య పాలనా బాధ్యత స్వీకరించెను ఇతడు రాష్ట్రకూట మొదటి అమోఘవర్షుని విధేయ సామంతునిగ నుండెను క్రీ శ 848 లో వేంగీ చాళుక్య ప్రభువు గుణగాంక మూడవ విజయాదిత్యుడు రాష్ట్రకూట రాజ్యభాగముల నాక్రమించెను అమోఘవర్షుడు వేంగిపై దండెత్తి తన మేనత్త కుమారుడగు గుణగాంక మూడవ విజయాదిత్యు నోడించి సామంతునిగ స్వీకరించెను ఈ యుద్ధమున వేములవాడ చాళుక్య రెండవ యుద్ధమల్లుడు పాల్గొని యుండును

రెండవ యుద్ధమల్లుని పరిపాలనా విశేషములను తెలుపు శాసనములు గాని, గ్రంథములు గాని లేవు ఇతడు తండ్రి, తాతల నాటి మహా సామంత రాజ్యమును రాష్ట్రకూట చక్రవర్తుల విధేయ సామంతునిగా క్రీ శ 835 నుండి 870 వరకు పాలించెను

## బద్దెగుడు

రెండవ యుద్ధమల్లుని తనయుడు బద్దెగ భూపాలుడు తండ్రి యనంతరము వేములవాడ రాజ్యపీఠమును క్రీ శ 870 లో నధివసించి, సుమారు 25 సంవత్సరములు పాలించెను ఇతనికి సోలదగండ బిరుదమున్నది సోలదగండ పదమున కపజయమెరుంగని యుద్ధవీరుడని యర్థము ఇతడు 42 యుద్ధములందు విజయము గాంచెను

"మొసళెయండిదిరం తిరెసిరా కొత్తి భీమనపతి గర్వదింపిడియె" అని పంపవివి విక్రమార్జున విజయ మందితనిని వర్ణించెను

మూడవ అరికేసరి పర్భిణి శాసనమందు బద్దెగడు "భీమం భీమ పరాక్రమైః నిలయం తంహేల యై వాగ్రహీ,దుగ్రం గ్రాహ మివా స్త్రరంబు సమరే దోర్విక్రమాద్బద్దెగః" అని చెప్పబడినాడు

పాండవ భీమునివలె బలపరాక్రమోపేతుడైన ఆ భీముని బద్దెగ, దవలిలగా బంధించెనని శాసన భాగమున కర్థము

రాష్ట్రకూట రెండవ కృష్ణుడు క్రీ శ 892 - 895 మధ్యకాలమున వేంగీదేశముపై దండ యాత్రలు నిర్వహించెను అప్పటి వేంగీ దేశ పాలకుడు తూర్పు చాళుక్య మొదటి భీముడు ఇతడు సింహాసన మధిష్టించుటలో ప్రతిఘటించిన దాయాదులు, రాష్ట్రకూట రెండవకృష్ణ భూపతి నాశ్రయించిరి కృష్ణరాజు వారిమాటను మన్నించి,పూర్వము గుణగ విజయాదిత్యుడు తన నోడించినందులకు ప్రతీకారము తీర్చుకొనుట కనువైన సమయ మాసన్నమైనదని భావించి వేంగి దేశముపై దండయాత్ర నిర్వహించెను ఈ దండయాత్రలో రాష్ట్రకూట సామంతులు సేనానులు పాల్గొనిరి వేములవాడ చాళుక్య రాజ్య ప్రభువగు బద్దెగడు తన సైన్యముతో రాష్ట్రకూట సైన్య సహాయమున కేగెను

తూర్పు చాళుక్య రాజన్యులు కొల్లేరు సరస్సులో అభేద్యమైన జల దుర్గమును నిర్మించి యుండిరి వేములవాడ బద్దెగడు సారథ్యము వహించిన రాష్ట్రకూట సైన్యము వేంగిపై దండయాత్ర చేయు టకు బయలుదేరుటను విని చాళుక్య భీముడు కొల్లేరు ప్రాంతమందున్న జలదుర్గమున దాగియుండెను

ముదిగొండ చాళుక్యులు సైన్య సమేతులై చాళుక్య భీముని సహాయార్థ మేతెంచిరి ఈ వంశ మునకు చెందిన కుసుమాయుధు డపరిమిత బలసంపన్నుడు కాకర్త్యగుండ దండాధిపుడు, వేములవాడ బద్దెగడు రాష్ట్రకూట రెండవ కృష్ణుని విజయమునకు ప్రాణములకు తెగించి పోరాడిరి ఈ యుద్ధమున కాకర్త్య గుండన చాళుక్య భీముని తనయుడగు ఇరిమర్తి గండని చేతిలో నిహతుడయ్యెను ఈ విష యము మచిలీపట్టణము, మాంగల్లు శాసనములు వెల్లడించు చున్నవి బద్దెగుని ఈ యుద్ధ విజయములు విక్రమార్జున విజయము, పర్భిణీ శాసనములు వర్ణించినవి

ఈ కొల్లేరు యుద్ధమున విజయము సాధించినను రాష్ట్రకూట రెండవ కృష్ణునికి లాభము కలుగలేదు యుద్ధానంతరము వేంగీ దేశము భీముని యేలుబడిలో నుండుటనుబట్టి ఈ యుద్ధము రాష్ట్ర కూటులకు వృథా ప్రయాస మయ్యెనని భావింపవచ్చును

బద్దెగడు చాళుక్య భీముని కొల్లేరు జలదుర్గమున బంధించినను, ముదిగొండ చాళుక్య సైన్యము కుసుమాయుధుని నాయకత్వమున రాష్ట్రకూట సైన్యము నెదిర్చి కొల్లేరు కోటనుండి తరిమివేసి

యుండుట కావున తొలుత విజయము సాధించినను, అది ఫలితము లేనిదై, రాష్ట్రకూటుల అపజయమునకు దారితీసెను

బద్దెగడు రెండవ కృష్ణుని విధేయ సామంతునిగా క్రీ శ 870 నుండి 895 వరకు వేములవాడ చాళుక్య రాజ్యము నేలెను

## మూడవ యుద్ధమల్లుడు :

బద్దెగని కుమారుడు మూడవ యుద్ధమల్లుడు క్రీ శ 895 లో వేములవాడ రాజ్యపాలనా బాధ్యత వహించెను ఇతని పాలనా విశేషములు తెలియుటలేదు ఇతడు రాష్ట్రకూట రెండవ కృష్ణ భూపతి సామంతునిగా వ్యవహరించెను

గంగవాడి పాలకు డెరయ నీతిమార్గుడు కొందరు సామంతులతో కలిసి రాష్ట్రకూట రాజ్యాధికారమును ధిక్కరించుటవలన అమోఘవర్షుని సేనాని బంకెయ నల్లకేతనుడు తూర్పు చాళుక్య విజయాదిత్య, వేములవాడ చాళుక్య మూడవ విజయాదిత్యునితో కలిసి ఎరయ నీతిమార్గు నోడించిరి అమోఘవర్షుడు తన తనయ అబ్బలబ్బెను ఎరయ నీతిమార్గుని తనయుడగు బూతుగనికిచ్చి వివాహ మొనర్చి మైత్రి నెరపెను

మూడవ యుద్ధమల్లుడు రాష్ట్రకూట సైన్యముతో కలిసి లాట, కనోజు ప్రభువుల నోడించుటలో తోడ్పడెను

మూడవ యుద్ధమల్లుడు వేములవాడ చాళుక్య సామంత రాజ్యమును క్రీ శ 895 నుండి 910 వరకు సుమారు 15 సంవత్సరములు పాలించెను

## రెండవ నరసింహుడు :

మూడవ యుద్ధమల్లుని తనయుడు రెండవ నరసింహుడు తండ్రి మరణానంతరము క్రీ శ 910 లో చాళుక్య రాజ్యపీఠ మధివసించెను వేములవాడ శిలాశాసనము, విక్రమార్జున విజయము ఇతనిని ప్రశంసించినవి

రెండవ నరసింహుడు తండ్రివలె గాక గొప్ప పరాక్రమ వంతుడు రాజకీయ చతురుడు యుద్ధ విద్యలయం దసమాన నేర్పరితన మున్నవాడు రాష్ట్రకూట మూడవ ఇంద్ర వల్లభుని సామంతుగ నితడనేక యుద్ధములందు పాల్గొని విజయములు సాధించి చక్రవర్తి ప్రేమకు పాత్రుడయ్యెను

రెండవ నరసింహుడు లాట, సప్త మాళవములను జయించి ఆ రాజుల నుండి కప్పము వసూలు చేసినట్లును, ఘూర్జర రాజగు మహీపాలు నోడించినట్లును గంగాతీరము వరకు రాష్ట్రకూట

సైన్యములను నడిపి అనేక రాజ్యములను జయించి, తన వారువములు గంగానదిలో గ్రుంకులాడునట్లు చేసెనని వేములవాడ శాసనమందును, విక్రమార్జున విజయమను గ్రంథమందును తెలుపబడినది

రెండవ నరసింహుడు తన కరవాలమును కాళప్రియమున కడిగి నచట నొక విజయ శాసనమును వేయించెను ఇది నరసింహుని ఉత్తర దేశ దిగ్విజయ సమయమందు ప్రకటింపబడిన శాసనము

రెండవ నరసింహుడు రాష్ట్రకూట మూడవ ఇంద్ర వల్లభుని మహా సామంతాధిపతిగా వేములవాడ రాజ్యము నేలుచు అనేక యుద్ధములందు పాల్గొని విజయము సాధించినాడు రాష్ట్రకూట ఇంద్రవల్లభు డితని ధైర్య సాహసములను, యుద్ధ తంత్రజ్ఞతను, విజయ పరంపరలను గాంచి, తన సోదరి జాకవ్వ నిచ్చి వివాహ మొనర్చెను ఈ వైవాహిక బంధమువలన రాష్ట్రకూట చక్రవర్తులు, వేములవాడ చాళుక్య లత్యంత సన్నిహితులగుట కవకాశ మేర్పడినది రెండవ నరసింహుని కీర్తి ప్రతిష్ట లినుమడించినవి

రెండవ నరసింహుడు అసాధారణ ప్రజ్ఞావంతుడగుటవలన రాష్ట్రకూట సామ్రాజ్యమున ప్రబల శక్తివంతునిగను, చక్రవర్తి బంధుకోటిలోని వాని గను సర్వే సర్వత్ర గౌరవాదరములు పొందుచుండెను

ఇంద్రవల్లభుడు ఘూర్జర ప్రతీహార వంశీయుల రాజధాని యగు మహోదయముపై దండయాత్ర నిర్వహించెను పంప భారతమున వర్ణించినట్లు నరసింహుడు జయించిన మహీపాలుడు ప్రతీహార వంశీయుడగు మహీపాలుడేయగును రాష్ట్రకూట మూడవ ఇంద్రవల్లభుని పక్షమున రెండవ నరసింహు డీ దండయాత్రలు నిర్వహించెను రాష్ట్రకూట సైన్యములకు నాయకత్వము వహించిన రెండవ నరసింహుడు ఈ దండయాత్రలందు సప్త మాళవములను జయించి యుండును ఆ రాజ్య పాలకుని నుండి కప్పము వసూలు చేసి యుండును

రెండవ నరసింహుడు కాళప్రియమున జయ స్తంభమును వేయించినట్లు వేములవాడ శాసనము, తన తురగములను గంగానదిలో స్నానమాడించినట్లు విక్రమార్జున విజయము తెలుపుచున్నవి

కాళప్రియము యమునానదీ తీరమందున్న కాల్పి ఇచట కాళప్రియ దేవాలయమున్నది ఇచటి నుండి మహోదమునకు సైన్యములను నడిపించుకొని వెళ్ళి ప్రతీహార మహీపాలు నోడించి అతని రాజ్యమును వశపరచుకొని యుండును మహోదయము గంగాతీరమందున్న కనోజి నగరము

గంగానది పర్యంతము దండయాత్ర నిర్వహించి విజయములు సాధించి తన వారువములు గంగానదీ జలమును సేవించి, అందు స్నానమాడునట్లు చేసి తిరిగి వచ్చుచు కాళప్రియమున విజయ శాసనమును చెక్కించి యుండును రెండవ నరసింహుడు రాష్ట్రకూట సైన్యమున కాధిపత్యము వహించి అనేక యుద్ధములందు విజయము గాంచుచు నిజ రాజ్యము నతి సమర్థవంతముగ క్రీ శ 910 నుండి 930 వరకు పాలించెను

## రెండవ అరికేసరి :

రెండవ నరసింహుని యనంతర మాతని తనయుడు రెండవ అరికేసరి క్రీ శ 930లో వేములవాడ చాళుక్య సింహాసన మధిష్టించెను ఈ వంశమునం దితడు గొప్ప రాజుగా కీర్తింపబడి నాడు పరాక్రమవంతుడును, యోధుడును, రాజనీతిపరుడును, విద్యావిశారదుడును, కవి పండిత పోషకుడును నగు రెండవ అరికేసరి రాష్ట్రకూట మూడవ ఇంద్రవల్లభుని మేనల్లుడు

ఇంద్రవల్లభుడు తన కుమార్తెయగు రేవకనిర్మాడిని రెండవ అరికేసరికిచ్చి వివాహ మొనర్చెను అరికేసరి రాజ్యపీఠ మలంకరించిన పిదప రాష్ట్రకూట రాజ్య వ్యవహారములందు జోక్యము కలిగించుకొనెను బలవంతుడును మహాసామంతాధిపతియు, ఇంద్రవల్లభుని జామాతయునగు రెండవ అరికేసరి దక్షిణాపథమున ప్రముఖ వ్యక్తిగా కీర్తింపబడెను అరికేసరి రెండవ భార్య రాష్ట్ర కూట వంశ సంజాతయగు లోకాంబిక

క్రీ శ 930 లో రెండవ అరికేసరి సింహాసన మధిష్టించునాటికి, మూడవ ఇంద్రవల్లభుడు మరణించెను అతని తనయుడు రెండవ అమోఘవర్షుడు రాష్ట్రకూట సామ్రాజ్యాధినేత యయ్యెను కాని అతని సోదరుడు నాల్గవ గోవిందు డన్నను రాజ్యభ్రష్టుని గావించి క్రీ శ 930 లో సింహాసన మధిష్టించెను

రెండవ అరికేసరికి సంబంధించిన నాలుగు శిలాశాసనములలో వేములవాడ శాసన మత్యంత ప్రాధాన్యము వహించుచున్నది ఇది సంస్కృత శాసనము ఇందు శక సంవత్సరము గాని, విజయ రాజ్య సంవత్సరము గాని పేర్కొనబడలేదు. రెండవ నరసింహుని ప్రశంస గల శాసనమిది వినయా దిత్య యుద్ధమల్లుని నుండి రెండవ అరికేసరి వరకుగల వేములవాడ చాళుక్య వంశావళి ఇందున్నది

రెండవ అరికేసరి తంత్రపాలుడు పెద్దన వేములవాడలో నత డొక ఆదిత్యాలయమును నిర్మించెను. ఆ ఆలయమును చూచుట కరికేసరి వచ్చి, పెద్దన కోరికపై 100 నివర్తనముల భూమిని అతిథి అభ్యాగతుల నివాసమునకై నిర్మించిన సత్రమును నిర్వహించుటకు ఉత్తరాయణ సంక్రాంతిన

దానమొసంగు నిమిత్తము నందీ శాసనమును వేయించెను శాసనమున రెండవ నరసింహునితో పాటు రెండవ అరికేసరి ప్రశంసింపబడినాడు

రాష్ట్రకూట నాల్గవ గోవిందుడు ముదిగొండ చాళుక్య విజయాదిత్యు నోడించుటకు వంద్యా ర్యుని నాయకత్వమున గొప్ప సైన్యమును పంపించెను ముదిగొండ చాళుక్య విజయాదిత్యుడు రాష్ట్ర కూట సైన్యము నెదుర్కొనజాలక రాజ్యమును వీడి, రెండవ అరికేసరి నాశ్రయించెను అరికేసరి విజయాదిత్యునికి శరణొసంగి రక్షించెను

ముదిగొండ చాళుక్యులు వేంగీ చాళుక్య వంశములోని నొక శాఖకు చెందినవారు వేంగీ చాళుక్య ప్రభువుల అనుయాయులుగా స్వతంత్ర రాజ్యమును వీరేలుచుండిరి ముదిగొండ రాజ్యము ఖమ్మము, కొఱవి ప్రాంతములందు వ్యాపించియుండెను అనుమకొండ విషయము కొఱవిసీమ నంటి యుండెను వేములవాడ చాళుక్యరాజ్య మనుమకొండ సీమవరకు విస్తరించియుండెను

రాష్ట్రకూటులు, వేంగీ చాళుక్యులు బద్ధవిరోధులు వీరు తరచు యుద్ధము చేయుచుండిరి రాష్ట్రకూటులు వేంగీ దేశముపై దాడి చేయవలసి వచ్చినపుడు ముదిగొండ చాళుక్య రాజ్యసీమల నతిగ మించి పోవలసి వచ్చుచుండెను రాష్ట్రకూట సైన్యము నెదుర్కొనువంతు ముందుగా ముదిగొండ చాళు క్యులదై యుండెను ముదిగొండ చాళుక్యులు బలసమన్వితులు వారు రాష్ట్రకూట సైన్యము నెదుర్కొని వేంగీ చాళుక్యులకు సహకరించుచుండిరి

క్రీ శ 922 లో వేంగీదేశమున మొదటి చాళుక్య భీముడు దివంగతు డయ్యెను తరువాత అతని కుమారుడు మొదటి అమ్మరాజు సింహాసన మధిష్ఠించి ఆరేండ్లు పాలించి, క్రీ శ 928 లో మరణించెను అమ్మరాజు తనయుడు కంఠికా విజయాదిత్యుడు తండ్రి యనంతరము రాజై, 15 దినములు మాత్రమే పాలింపగలిగెను

మొదటి యుద్ధమల్లుని తనయుడు తాడపరాజు, కంఠికా విజయాదిత్యుని తొలగించి వేంగి సింహాసన మాక్రమించెను కాని మొదటి భీముని రెండవ కుమారుడు విక్రమాదిత్యుడు తాడపరాజును సంహరించి సింహాసన మధిష్ఠించి 11 నెలలు మాత్రమే వేంగిని పాలించెను

ఈ యదనున రాష్ట్రకూట నాల్గవ గోవిందుడు వేంగీ రాజ్య విషయములందు జోక్యము కలిగించుకొని, తాడపరాజు కుమారుడగు యుద్ధమల్లునికి సహాయపడ దలచి వేంగిపై దండయాత్ర నిర్వహించి యుద్ధమందు విక్రమాదిత్యు నోడించి వేంగి నాక్రమించి యుద్ధమల్లుని సింహాసమందు ప్రతిష్ఠించెను

ముదిగొండ పాలకుడగు బిజయిత లేక విజయాదిత్యుడు యుద్ధమల్లుని రాజుగా నంగీకరింప లేదు అతడు యుద్ధమల్లుని శత్రువుల పక్షము వహించి, రాష్ట్రకూటాన్వయ ఆధిక్యతను నిరసించెను

అమ్మరాజు సవతి సోదరుడు చాళుక్య రెండవ భీముడు, అమ్మరాజు సోదరుడు కంరికా విజయాదిత్యుడు, అమ్మరాజు కుమారుడు భీముడు ఎవరికి వారు వేంగీ రాజ్యమును సాధించుటకు సమర సన్నాహము లొనర్చుచుండిరి

అమ్మరాజుకు నిజమైన వారసులు కంరికా విజయాదిత్యుడు, భీముడు మాత్రమే కాని, రెండవ యుద్ధమల్లుడు వేంగీ రాజ్యమునకు రాదగినవాడు కాడని ముదిగొండ బిజయిత భావించెను యుద్ధ మల్లుడు రాష్ట్రకూటల సహాయమున సింహాసన మధిష్టించుట బిజయితకు కంటగింపైనది అతడు యుద్ధ మల్లునిపై దండెత్తుటకు సకల సన్నాహము లొనర్చుచుండెను

రాష్ట్రకూట నాల్గవ గోవిందుడు రెండవ యుద్ధమల్లుని పక్షము వహించెను కొలవి సీమ నేలుచున్న బిజయిత యుద్ధమల్లునికి వ్యతిరేకి కావున గోవిందవల్లభుడు ముందు ముదిగొండ రాజ్యముపై దండెత్తదలచెను

రెండవ అరికేసరి పెద్ద బావమరది రెండవ అమోఘవర్షుడు అతని నతని సోదరుడు నాల్గవ గోవిందుడు రాజ్యభ్రష్టుని గావించి సింహాసన మాక్రమించెను

అరికేసరి ఈ దారుణ చర్యను సహింపలేదు రాజ్యమునకు వారసుడైన రెండవ అమోఘ వర్షుడు నిరాశ్రయుడగుట అతనికి బాధాకరమయ్యెను అరికేసరి తన రెండవ బావమరదియగు నాల్గవ గోవిందుని రాష్ట్రకూట సింహాసనమునుండి దించుటకు యత్నించెను

నాల్గవ గోవిందునితో ముదిగొండ విజయాదిత్యునికి వైరమేర్పడినది ముదిగొండ విజయా దిత్యుడు కొలవి శాసనమున గొణగాయ్యగా పేర్కొబడినాడు ఇతని తండ్రి కుసుమాయుధుడు తూర్పు చాళుక్య గుణగ విజయాదిత్యుని సామంతుడు కావున తన ప్రభువుపై గల అభిమానమును వెల్లడించు కొనుటకు తన కుమారునికి గుణక విజయాదిత్యుడని పేరిడెను కావున ముదిగొండ బిజయిత, విజయా దిత్య, గొణగయ్య, గుణగయ్య నామములతో కొలవి శాసనమునం దభి వర్ణింపబడిన వాడును పంప భారతమున పేర్కొనబడిన వాడును నితడే. ముదిగొండ బిజయిత పరాక్రమశాలి రాష్ట్రకూట రెండవ కృష్ణవల్లభునితో పోరాడి, మొదటి భీముడు వేంగీ సింహాసన మధిష్టించుటలో తండ్రి కుసుమాయుధునికి బిజయిత తోడుగా నుండి సహకరించెను

ముదిగొండ విజయాదిత్యుడు వేంగీదేశము నేలు రాజన్యులకు సామంతునిగా నుండి కొలవి సీమ నేలుచు, వేంగీ రాజ్య రక్షణార్థము రాష్ట్రకూటుల దండయాత్రల నెదుర్కొని విజయములు సాధించుచుండెను

రాష్ట్రకూట రెండవ కృష్ణుడు కొల్లేరు సరస్తీరమున పొందిన అపజయమునకు ముదిగొండ కుసుమాయుధుడు, విజయాదిత్యుడు కారకులని భావించి, ప్రచండ సైన్యముతో కొఱవి సీమపై దండెత్తి విజయము సాధించి, కాకర్త్య మూడవ గుండన కుమారుడగు ఎఱియ రాష్ట్రకూటుని ఆ రాజ్యమున ప్రతిష్ఠించెను.

ముదిగొండ విజయాదిత్యుడు రాజ్యమును కోల్పోయి, నూతన సైన్యమును సమీకరించుకొనెను క్రీ శ 912 లో రాష్ట్రకూట రెండవ కృష్ణుడు మరణించెను ఆ యదనున విజయాదిత్యుడు కొఱవిసీమపై దండెత్తి కాకర్త్య ఎఱియ రాష్ట్రకూటు నోడించి, పారద్రోలి కొఱవిసీమ నాక్రమించి, ముదిగొండ రాజ్యము నేలుచుండెను

క్రీ.శ 933 లో రాష్ట్రకూట నాల్గవ గోవిందుడు కొఱవి సీమపై దండెత్తెను ప్రచండ సైన్యయుతుడై దండెత్తి వచ్చిన రాష్ట్రకూట నాల్గవ గోవిందు నెదిరింపజాలక రాజ్యమును వీడి వేములవాడ రెండవ అరికేసరి నాశ్రయించెను

రెండవ అరికేసరి ముదిగొండ విజయాదిత్యున కాశ్రయ మొసంగుటయే గాక అతనిని ఆదిలాబాదు జిల్లాలోని చెన్నూరు సీమను పాలించుటకు నియమించెను ఈ విషయములు గొణగ విజయాదిత్య లేక బిజయిత కుమారుడగు ఒద్దెగుని క్రీ శ 941 నాటి చెన్నూరు అగస్త్యేశ్వరాలయ శాసనము వలన తెలియుచున్నవి

గొణక లేక బిజయిత సోదరుడు నిరవద్యుడు ఇతడు అమ్మరాజు ద్వైమాతురుడగు చాళుక్య భీముని పక్షము వహించి, రెండవ యుద్ధమల్లుని సింహాసన భ్రష్టుని గావించు యత్నము లొనర్చుచుండెను

ఈ రాష్ట్రకూట, ముదిగొండ, వేములవాడ, తూర్పు చాళుక్య రాజన్యుల యుద్ధములందు వేంగీదేశ రెండవ భీముడు విజయము సాధించెను గోవిందవల్లభునిచే పంపబడిన సైన్యమునకు నాయకత్వము వహించిన పణ్యార్యుని రెండవ అరికేసరి జయించినట్లు వేములవాడ శాసనమువలన విశదమగుచున్నది ఇందే ముదిగొండ చాళుక్య బిజ్జన లేక, విజయాదిత్యునకు రెండవ అరికేసరి ఆశ్రయ మొసంగినట్లున్నది.

రెండవ అరికేసరి మహారాజునకు రాష్ట్రకూట రాజకుటుంబముతో వైవాహిక బాంధవ్యమున్నది నాల్గవ గోవిందుని సోదరి రేవక నిర్మాడి నితడు వివాహమాడి యుండెను ఇతని తల్లి

జాకవ్వ రాష్ట్రకూట అకాలవర్ష కృష్ణుని తనయ కావున రెండవ అరికేసరి మూడవ ఇంద్రవల్లభుని మేనల్లుడు

రెండవ అరికేసరి బాల్యమున మేనమామయగు మూడవ ఇంద్రవర్మ చెంతనుండి విద్యాబుద్ధులు నేర్చి పరిపాలనా వ్యవహారములందును, యుద్ధ విద్యలయందును నిష్ణాతుడయ్యెను ఇతనికి రాష్ట్రకూట రాజ్య వ్యవహారములన్నియు తెలిసియుండెను

రాష్ట్రకూట రాజ్యమునకు నిజమైన వారసుడు మూడవ ఇంద్రవల్లభుని జ్యేష్ఠ కుమారుడగు రెండవ అమోఘవర్షుడు తండ్రి యనంతర మితడు రాజ్యపీఠ మలంకరించి క్రీ శ 929 నుండి 930 వరకు మాత్రమే పాలించెను ఇతని సోదరుడు నాల్గవ గోవిందు డితనిని తొలగించి క్రీ.శ. 930 లో రాష్ట్రకూట సామ్రాజ్యాధినేత యయ్యెను

రెండవ అరికేసరికి తన రెండవ బావమరదియగు నాల్గవ గోవిందుని చర్య సహింపరానిదయ్యెను అతడు గోవిందుని తొలగించుటకు కృతనిశ్చయు డయ్యెను

రాష్ట్రకూట సామంతులు కొందరు నాల్గవ గోవిందునికి వ్యతిరేకులై అతనిని తొలగించుటకు నిశ్చయించి సమయమునకై వేచి యుండిరి

రాష్ట్రకూట మూడవ ఇంద్రవల్లభుని సవతి సోదరుడు బద్దెగడు అతని తనయుడు మూడవ కృష్ణుడు ఈ తండ్రి తనయులిద్దరు నాల్గవ గోవిందునికి వ్యతిరేకముగ ప్రవర్తించుచుండిరి అతనిని రాజ్యాధికారము నుండి తొలగించు ప్రయత్నమందుండిరి బద్దెగుని మామ కాలచురి యువరాజదేవుడు మూడవ కృష్ణుని మాతామహుడు వీరు కాలచురి యువరాజ దేవు నాశ్రయించి అతనిని సైనిక సహాయ మర్థించిరి

రెండవ అరికేసరితో సఖ్యమొనర్చి బద్దెగడు కాలచురి సైన్యమును సహాయముగా తీసికొని వేములవాడ చేరెను

రెండవ అరికేసరి తన సైన్యమునకు తోడుగా, ముదిగొండ విజయాదిత్యుని సైన్యమును, కాలచురి సైన్యమును సమకూర్చుకొని, రాష్ట్రకూట నాల్గవ గోవిందుని సైన్యము నెదుర్కొనెను ఇరువాగుల సైనికులు ఘోర రణమొనర్చిరి ఈ యుద్ధమున నాల్గవ గోవిందుని సైన్య మోడిపోయెను గోవిందుడు పరాజితుడై రణరంగమును వీడి పారిపోయెను రెండవ అరికేసరి సైన్యకూటమికి విజయము లభించెను.

రెండవ అరికేసరి బద్దెగుని మూడవ అమోఘవర్షుడను పేర రాష్ట్రకూట సింహాసనమున ప్రతిష్టించెను క్రీ శ 935 లో వేంగి రాజ్యమున రెండవ యుద్ధమల్లుని ఓడించి, రెండవ భీముడు రాజయ్యెను అతడు ముదిగొండ రాజ్యమందున్న కొరవిసీమలో నిరవద్యుని రాజుగా నియమించెను

వేంగి, మాన్యఖేటము, కొరవిసీమ రాజ్యములం దధికారములు మారెను ఈ మార్పులకు రెండవ అరికేసరి రాజకీయపు టెత్తుగడలు, యుద్ధతంత్రము పరిపాలనానుభవము కారణములు

రెండవ అరికేసరి కక్కలుని సోదరుడగు బప్పువనయొక్క అంకకారుని యుద్ధమం దోడించెను బప్పువన అంకకారుడు నాల్గవ గోవిందుని పక్షమున పోరాడుచు యుద్ధరంగమున మరణించెను అంకకారుడన ఒక రాజునకు బదులుగా యుద్ధమొనర్చువాడు రెండవ అరికేసరి వేములవాడ శిలాశాసనమందు బప్పువన నంకకారుని ప్రశంస యున్నది

రెండవ అరికేసరికి సాంబరాంకుశ, అమ్మనగంధవారణ, ఆరూఢసర్వజ్ఞ, ఉదాత్త నారాయణ, గుణనిధి, గుణార్ణవ, త్రిభువనమల్ల ఆది బిరుదములున్నవి

కరీంనగర్ శాసనమునందు రెండవ అరికేసరి సబ్బి 20 వేలు పాలించుచున్నట్లు తెలుప బడినది చెన్నూరు అగస్త్యేశ్వరాలయ శాసనము పోదననా డితని రాజ్యమునం దున్నట్లు తెలుపుచున్నది రెండవ అరికేసరి పాలనాకాలమం దీవంశీయుల రాజధానిగా పోదన నగరముండెను గంగాధర పట్టణము ఈ వంశీయులకు కొంత కాలము రాజధానిగా వర్థిల్లియుండెను వేములవాడ, రెండవ అరికేసరి ఉపరాజధాని కావచ్చును

పెద్దన నిర్మించిన ఆదిత్యాలయమును చూచుటకు రెండవ అరికేసరి వేములవాడ కేతెంచి, అతని కోరికపై నూరు నివర్తనముల భూమిని దానమిచ్చినట్లు వేములవాడ శాసనము తెలుపుచున్నది కావున రెండవ అరికేసరి రాజధాని పోదన నగరమైనను, గంగాధర పట్టణమైనను ఐయుండును పెద్దన కోరికపై వేములవాడ కేతెంచిన రెండవ అరికేసరి ఆ ప్రాంతము రాజధాని కనువైనదని భావించి దానిని తన ఉపరాజధానిగా చేసికొనియుండవచ్చును వేములవాడ రాజ్యము విశాలమైనది గోదావరీ పరీవాహక ప్రాంతమం దున్నట్టిది గోదావరి నది కిరువైపుల విస్తరించియున్న రాజ్యమున కనుకూలమైన ప్రదేశమున వేములవాడ పట్టణ ముండుట వలన అరికేసరి దానిని ఉప రాజధానిగనో లేక రాజధానిగనో చేసికొని యుండును

రెండవ అరికేసరి సాహిత్యాభిమాని కవి పండితుడు కవి పండిత పోషకుడు పంప మహా కవి ఇతని ఆస్థాని ఈ మహాకవికి అరికేసరి ధర్మపురము నగ్రహారముగ నొసంగెను కన్నడ భాషా సాహిత్యము లితని కాలమున వృద్ధి చెందినవి

పంపకవి రచించిన విక్రమార్జున విజయము జైన కావ్యమైనను అతడు అరికేసరిని నాయకునిగా భావించి అర్జునునిగా భావించి మహా ప్రబంధముగ దానిని రచించెను

పంప మహాకవి సోదరుడు జినవల్లభుడు ఇతడు కుర్క్యాల శాసనమును వేయించెను జినవల్లభు డనేకమంది జైనమత గురువులను, పండితులను, కవులను ఆదరించి పోషించెను జనాశ్రయ మను ఛందో గ్రంధమును, మల్లియ రేచన జినవల్లభుని ప్రోత్సాహమున రచించెను వేములవాడ భీమకవి పేర వెలసిన ఈ గ్రంధము మల్లియ యను వైశ్య కవి పుంగవుడు రచించినట్లు భావింపబడుచున్నది

దక్షిణాపథ రాజకీయములందు కీలక పాత్ర వహించి, వేములవాడ చాళుక్య వంశ ప్రతిష్ఠ నినుమడింప జేసిన రెండవ అరికేసరి మహారాజు క్రీ శ 930-955 వరకు సుమారు పాతిక సంవత్సరములు పాలించెను

## వాగరాజు :

రెండవ అరికేసరి జ్యేష్ఠ కుమారుడు వాగరాజు తండ్రి మరణానంతరము క్రీ శ 955 లో సింహాసన మధిష్టించెను ఇతడు రాష్ట్రకూట మూడవ కృష్ణభూపతి సామంతుడు కృష్ణభూపతి తండ్రి ఒద్దెగదు రాష్ట్రకూట సింహాసన మధిష్టించుటలో వాగరాజు తండ్రి రెండవ అరికేసరి సహాయపడి యుండెను

శక సంవత్సరము 881 = క్రీ శ 959 గడచిన సిద్ధార్థి చైత్రమాస త్రయోదశిన, అరికేసరి పెద్దకుమారుడగు వాగరాజు గంగాధర పట్టణము రాజధానిగా రాజ్యమేలుచు కృష్ణవల్లభునితో గూడి మేల్పాడిలో నున్న సమయమున సోమదేవ సూరి తన యశస్తిలక చంపూ కావ్యమును పూర్తి చేసెనని ఆ గ్రంధమున వ్రాయబడియున్నది

వాగరాజు మూడవ కృష్ణవల్లభుని సామంతుడు నేటి కరీంనగర్ మండలములోని కుర్క్యాల సమీపమందున్న గంగాధర పట్టణము వాగరాజు రాజధానిగా నుండెను

జిన వల్లభుడు వేయించిన బొమ్మలమ్మగుట్ట శాసనమున్న ప్రదేశమునుండి గంగాధర నాలుగు కిలోమీటర్ల దూరమందున్నది ఇదివరలో పంచాయతీ సమితి కేంద్ర స్థానమునమున్న ఈ గ్రామము మండల ప్రజాపరిషత్తు కార్యస్థానముగ నున్నది వాగరాజు గంగాధర రాజధానిగా వేములవాడ చాళుక్య రాజ్యమును క్రీ శ 955 నుండి 960 వరకు పాలించెను

## బద్దెగడు :

వేములవాడ చాళుక్య రెండవ అరికేసరికి లోకాంబికవలన జన్మించిన బద్దెగడు వాగరాజు తరువాత రాజయ్యేను వేములవాడలో నితడు వేయించిన శాసనమొకటి లభించినది అందితడు సోమ దేవ సూరికొరకు శుభదామ జినాలయమును నిర్మించినట్లున్నది ఇతడు తండ్రి పాలించు కాలమున, మహాకవిగా, జైనమతాచార్యునిగా ప్రసిద్ధి వహించియున్న సోమదేవసూరియెడ భక్తిభావము కలిగి యుండెను బహుశః సోమదేవసూరి బద్దెగుని విద్యాగురువై యుండును

బద్దెగుడు పాలించు కాలమున సోమదేవ సూరి వేములవాడలో నివసింపదలచి తన కోరికను వెల్లడించి యుండును గురువుపైగల భక్తి భావమున నతడు శుభదామ జినాలయమును నిర్మించి అతని కన్ని సౌకర్యము లేర్పరచి యుండును బద్దెగుడు వేములవాడ రాజ్యమును క్రీ శ 960 నుండి 966 వరకు పాలించెను

## మూడవ అరికేసరి :

బద్దెగుని తరువాత అతని కుమారుడు మూడవ అరికేసరి, క్రీ. శ 966 లో వేములవాడ రాజ్యపాలకుడయ్యేను. ఇతడు తన రాజధానిని గంగాధరనుండి వేములవాడకు మార్చెను. గంగాధర పట్టణముకన్న నీటివసతిగల వేములవాడ పట్టణము రాజధానికి యోగ్యమని నతడు భావించియుండును. వేములవాడ పట్టణము నంటి పారుచున్న పెద్దవాగు నీరు నేటికిని గ్రామీణుల కుపయోగపడుచున్నది.

మూడవ అరికేసరి, పర్భిణి తామ్ర శాసనమును వేయించెను క్రీ శ 966 లో రాజధానియగు లేంబుల వాడలో రాజ్యమేలుచు, సోమదేవ సూరికొరకు తన తండ్రి బద్దెగడు నిర్మించిన శుభదామ జినాలయ వసదికి నవసుధాకర్మబలి నివేద్యార్థము సబ్బి సహస్రములోని రేపాక ద్వాదశాంతర్గత వనికటువలు గ్రామమును దానమిచ్చు సందర్భమునందు పర్భిణి తామ్ర శాసనమును మూడవ అరికేసరి వేయించెను

క్రీ. శ 968 లో మూడవ అరికేసరి రేపాక గ్రామమునం దొక జినాలయమును నిర్మించిన ట్లచటి శిలాశాసనము తెలుపుచున్నది

క్రీ శ 973 లో కల్యాణీ చాళుక్య రెండవ తైలపుడు రాష్ట్రకూట వంశమును నిర్మూలించి సింహాసన మాక్రమించెను. ఇతడు రాష్ట్రకూటుల పాలనములో నున్న రాజ్యభాగములన్నింటిని తన యేలుబడిలోనికి దెచ్చుకొనెను

మూడవ అరికేసరి రాష్ట్రకూట రాజ్య పతనానంతరము కల్యాణీ చాళుక్య చక్రవర్తుల సామంతునిగ వ్యవహరించి యుండును ఇతని పాలనా కాలము క్రీశ 960 - 973

మూడవ అరికేసరి యనంతరము వేములవాడ రాజ్యము నతని సంతతివారు పాలించి యుందురు మూడవ అరికేసరి తనయుడు బద్దెగడు, అతని తనయుడు బహుశః అరికేసరి పాలనానంతరము బద్దెగడు లేక భద్రగుడను నతడు వేములవాడ రాజ్యపాలనా బాధ్యత వహించియుండును

కాజీపేటదర్గా శాసనమువలన కాకతి మొదటి ప్రోలరాజొక భద్రగుని పారద్రోలినట్లు తెలియుచున్నది ఆ భద్రగుడు వేములవాడ పాలకుడగు మూడవ అరికేసరి వంశమునకు చెందిన బద్దెగడై యుండవచ్చును ఇంతటితో వేములవాడ చాళుక్య రాజ్య మంతరించెను

# వేములవాడ చాళుక్యుల నాటి సాంఘిక చరిత్ర

వేములవాడ చాళుక్యులు పాలించిన కాలపు తెలంగాణ ప్రాంత సాంఘిక చరిత్ర తెలియుటకు ఆ వంశీయుల శాసనములు, సమకాలికి రాజులగు రాష్ట్రకూట తూర్పు చాళుక్య, చోళ రాజ వంశీయులకు సంబంధించిన శాసనములు, పంప మహాకవి రచనలు, వల్లియ రేచన సహస్రాక్షరచరితము, సోమదేవసూరి యశస్తిలక చంపువు వంటి గ్రంథములు, కట్టడములు, దేవాలయ శిల్పము లాధారములు

వేములవాడ చాళుక్యుల పాలనమున కన్నడ భాష అభివృద్ధి చెందినది అనేక గ్రంథములు ఆ భాషలో రచింపబడినవి ఈ రాజన్యులు పాలించిన ప్రాంతములు తెలుగు సీమలో నుండుటవలన తెలుగు భాషాభివృద్ధి జరిగినది పంప మహాకవి సోదరుడు జినవల్లభుడు వేయించిన కుర్క్యాల శిలా శాసనమున మూడు కంద పద్యములున్నవి ఇవి తెలుగు భాషలో తొలి కంద పద్యములు

రేనాటి చోళుల శాసనములందును, తూర్పు చాళుక్య ప్రభువులు ప్రకటించిన శాసనము లందును తెలుగు పద్యములున్నవి జినవల్లభునికి పూర్వము ప్రకటించిన రేనాటి చోళ శాసనములు వృత్త గంధి పద్యములలో నున్నవి తూర్పు చాళుక్య ప్రభువుల తొలి శాసనములందు మధ్యాక్కరలు లున్నవి. వేములవాడ చాళుక్యులు కన్నడ భాషను రాజ భాషగా వాడుటవలన తెలుగు భాష కంతగా ప్రాముఖ్యము లభింపలేదు

వేములవాడ చాళుక్యుల కాలమున వెలసిన శాసనములలోని తెలుగు భాష ఆంధ్ర వాఙ్మయారంభ దశను సూచించును ఈ రాజ వంశీయులు క్రీ శ 641 నుండి క్రీ శ 1052 వరకు పాలించి యుండిరి వీరి పాలనా కాలమున కన్నడాంధ్ర భాషలు, ఆంధ్ర శిల్పము అభివృద్ధి గాంచినవి

రాష్ట్రకూట, చాళుక్య రాజుల కాలమున వెలసిన శిల్పమున కొక ప్రత్యేకత యున్నది తరువాత కాకతి శిల్పము ప్రసిద్ధి గాంచినది

వేములవాడ చాళుక్యులు జైన మతానుయాయులు వీరిలో కొందరు శైవ మతాభిమానులుండిరి పరమత సహనముగల ఈ రాజవంశీయు లనేక దేవాలయములను నిర్మించుటలో తోడ్పడినారు జైన మతానుయాయులైన వేములవాడ చాళుక్యు లనేక జైన బసదులను, విద్యాలయములను, జినాలయములను నిర్మించిరి వైదిక మతానుయాయులకు సమస్త సౌకర్యము లేర్పరచిరి విప్రుల కనేక అగ్రహారముల నొసంగిరి

జైన మునులను గౌరవించి, ఆదరించి, పోషించిరి జైన బసతులందున్న జైన మునులకు వందల కొలది విద్యార్థులకు ఉచితముగా విద్యా బోధన చేయుచుండిరి సంగీత, సాహిత్య, శిల్ప, చిత్ర, వేదాంత శాస్త్రము లీవిద్యాలయములందు బోధింపబడుచుండెను

తెలంగాణ మండలి నిజామాబాదు, కరీంనగర్, ఆదిలాబాదు మండలములందు వీరి పరిపాలన ముండెను గోదావరి నది ఉత్తర దక్షిణ తటములందును, మంజీరానదీ పరీవాహ ప్రాంతమందును వేములవాడ చాళుక్యుల రాజ్యము విస్తరించియుండెను

రాష్ట్రకూట చక్రవర్తుల సామంతులుగను, బంధువులుగను నున్న వేములవాడ చాళుక్యుల కాలమున జైన మతము వర్ధిల్లినది

వేములవాడ చాళుక్యుల కాలమున సమస్త కళలు వృద్ధి చెందినవి ప్రజల జీవన విధానము లోను ఆచార వ్యవహారములలోను నూతన పరిణామములు కలిగినవి కన్నడ సంప్రదాయములు, సంస్కృతి, భాషా సాహిత్యములతోపాటు ఆంధ్ర భాష, సంస్కృతి వృద్ధి గాంచినవి

ఈ రాజన్యులు పాలించిన కాలమున రాష్ట్రకూట చక్రవర్తుల ప్రభావము తెలంగాణ మందంతట విస్తరించినది వేములవాడ చాళుక్యులు, కాకతీయులు రాష్ట్రకూట ప్రభువుల సామంతులుగ నుండి వారి పరిపాలనా పద్ధతులను తమ తమ రాజ్యములం దమలుపరిచియుండిరి విధేయ సామంతులుగ నున్న వేములవాడ చాళుక్యులు రాష్ట్రకూటాన్వయు లొనర్చు యుద్ధములందు సహకరించి వారి మన్ననలకు పాత్రులైరి వేములవాడ చాళుక్యుల పాలనాకాలపు ప్రజల సాంఘిక చరిత్ర మిచట క్లుప్తముగా వ్రాయబడుచున్నది

## పరిపాలనా విధానము :

వేములవాడ చాళుక్యుల పాలనమున వారు పాలించు రాజ్యము సుభిక్షముగా నుండెను భూమి సస్యశ్యామలమై యుండెను కరువు కాటకములు లేక ప్రజలు సుఖమయ జీవనము గడుపు చుండిరి సపాదలక్ష దేశమున ఈ రాజవంశీయులు క్రీ శ 750 నాటికి, స్థిరపడి యుండిరి

పరిపాలనా సౌకర్యమునకు వేములవాడ రాజ్యము విషయములుగను, నాడులుగను, సీమలు గను, సీమలు పురములుగను, గ్రామములుగను విభజింపబడి యుండెను వేములవాడ, చెన్నూరు, పోదన నగరము, గంగాధర వంటి పట్టణము లానాడు ప్రసిద్ధిగాంచి యుండెను

వేములవాడ రాజ్యము మండలములుగను, మండలములు గ్రామములుగను విభజింపబడి యుండెను పోదన నగరము వీరి తొలి రాజధాని. తరువాత గంగాధర, వేములవాడ పట్టణములు వీరి రాజధానులుగ వర్ధిల్లినవి

రాజు సర్వ స్వతంత్రుడు మంత్రి మండలి సలహా ననుసరించి ఈ రాజన్యులు పరిపాలనా వ్యవహారములను నిర్వహించుచుండిరి సీమను పాలించుటకు సేనానాయకుడు నియమింపబడి యుండెను రాజ్య ఆర్థిక వ్యవస్థను, రాజకీయ, సాంఘిక పరిస్థితులను అనుసరించి రాజు పటిష్ట మొనర్చు చుండెను

వేములవాడ చాళుక్యుల పాలనమున పాలనాయంత్రాంగ నిర్వహణకు గ్రామము ప్రాతిపదికగా నుండెను రాజ్యమున మంత్రి, పురోహితుడు, సైన్యాధిపతి, దౌవారికుడు, దండనాథుడు, విషయాధిపతి లేక సీమనేలు అధికారి, ఆయుక్త, నియుక్త, అధ్యక్షుడు, గ్రామాధికారి మున్నగువారు పరిపాలనా వ్యవహారములను నిర్వహించుచు రాజాజ్ఞలకు బద్ధులై వ్యవహరించుచుండిరి రాజ్యమున పరిపాలనా వ్యవస్థ పటిష్టమై యుండెను

తమ రాజ్య పాలనా వ్యవహారముల నతి సమర్థవంతముగ నిర్వహించుచు తమ యేలికలగు రాష్ట్రకూట చక్రవర్తుల ఆదేశముల ననుసరించుచు చక్కని పాలనా వ్యవస్థ నేర్పరచిన వేములవాడ చాళుక్యులు ప్రజాభిమానమును చూరగొని, సమ్యక్ప్రజాపాలన మొనర్చు ప్రభువులుగా కీర్తి గాంచి యుండిరి

విషయాధిపతులు, సీమలపై ఆధిపత్యము వహించువారు, దుర్గాధీశ్వరులు నిర్ణీత సమయమున పన్నులు వసూలు చేసి రాజకోశాగారమున కంపుచుండిరి కొందరు మండలాధీశులు సంవత్సరమున కొక పర్యాయము కప్పములు చెల్లించుచుండిరి సీమలందును, దుర్గాధీశ్వరుల యధీనమందున్న ప్రదేశములందును ప్రభుత్వాధికారులుండిరి వీరి యధీనమున కొంత సైన్యముండెడిది యుద్ధ సమయములందు సీమలయందున్న సైన్యము రాజు సహాయార్థము పంపబడుచుండెను

రాజు సర్వాధి కారములు కలిగియుండెను మహామాత్యుడు, అమాత్యులు, దండ నాయకులు రాజు తరువాత పేర్కొనదగిన పాలకులు యువరాజు నియామకము వేములవాడ చాళుక్య వంశమందుండెను యువరాజులు, రాజకుటుంబీకులు సమున్నత పదవులను నిర్వహించుచు అవసర సమయములందు యుద్ధములందు పాల్గొనుచుండిరి

రాజ్యమున భూమిపై వచ్చు పన్ను ముఖ్యాదాయముగ నుండెను భూసారము, నీటివనరులు, భూపరిమాణము ననుసరించి పన్నులు విధించుచుండిరి పన్నులులేని భూములను ఉంభాలి యనుచుండిరి

వేములవాడ రాజ్యమున పన్ను లనేక విధములుగ నుండెను వృత్తిపన్ను, వ్యవసాయ భూములపై పన్ను, ఇంటిపన్ను, పెండ్లి పందిళ్ళపై పన్ను చెల్లింపవలసి యుండెను వృత్తిపన్నులు చెల్లించువారిలో వ్యాపారులు, అగసాలులు, కుమ్మరులు, కమ్మరులు, గొడుగులు తయారుచేయువారు, వివిధ విలాస వస్తువుల నమ్మువారు, వివిధ వృత్తుల నవలంబించువా రుండిరి

రాజ్యమందున్న నదులు, నిధులు, ఖనిజములు రాజు అధికార పరిధిలో నుండెను వీటిపై వచ్చు ఆదాయము రాజ కోశాగారమునకు చేరుచుండెను రాజ్యమున పన్నులవలన అధికాదాయము వచ్చు చుండెను పన్నులు, సుంకములు వసూలు చేయుటకు సుంకాధికారులు నియమింపబడి యుండిరి.

రాజ్యమందున్న సుంకాధికారులపై నొక అధికారి పర్యవేక్షకునిగ నుండెను ఇతనిని వడ్డ వ్యవహారి అనెడివారు ఇతనికి ముఖ్యమైన పన్నులను విధించు అధికారము కలదు

గ్రామములందు పన్నుల లెక్కలను కరణములు చూచుచుండిరి సుంకాధికారులపై భండారి ఆధిపత్యము వహించుచుండెను రాజ్యాదాయమున కొంత భాగము ఈతిబాధలకు, లోక క్షేమమునకు వినియోగించుచుండిరి తక్కిన ద్రవ్యమును పరిపాలనా వ్యవహారములకు, రాజ కుటుంబము వారి అవసరములకు, సైన్య నిర్వహణ కుపయోగించుచుండిరి అత్యవసర పరిస్థితులను, కరువు కాటకములను, ఆకస్మిక యుద్ధములను ఎదుర్కొనుటకు కొంత ద్రవ్యము రాజకోశాగారమున నిలువయుంచెడివారు.

నీటి పారుదల సౌకర్యము లేర్పరచి, వ్యవసాయాభివృద్ధికి వేములవాడ చాళుక్యులు పాటు పడిరి నదులపై ఆనకట్టలు నిర్మించి, కాల్వలు త్రవ్వించి రైతులకు నీటి పారుదల వసతుల నేర్పరచిన వేములవాడ చాళుక్యులు ప్రజాభిమానమును చూరగొనిరి

ప్రజా సౌకర్యార్థము రహదారులను నిర్మించిరి పాఠశాలలను నెలకొల్పిరి సత్రములను, బసదులను, వైద్యాలయములను కట్టించిరి ఈ రాజన్యులు ప్రజాహితమును గోరి గోదావరి నదీతీరమం దనేక స్నాన ఘట్టములను నిర్మించుటయేగాక తైర్థికుల కనేక సౌకర్యము లేర్పరచిరి

పావన గోదావరీ నది, మంజీర, మానేరు ప్రణీతా నదులు వీరి రాజ్యమున ప్రవహించు చుండెను ఈ నదులు వ్యవసాయమునకు వ్యాపారమునకు ఉపయోగపడుచుండెను మంజీరానది, గోదావరినది ఓడలు పయనించుట కనుకూలముగనుండెను దేశ విదేశ వ్యాపార మానాడు అభివృద్ధిలో నుండెను తూర్పు తీర రేవుపట్టణములనుండి గోదావరి నదిపై పయనించి మంజీరికా దేశమునకు నావలలో వర్తకులు వచ్చుచుండిరి వేములవాడ రాజ్యమునందున్న కాళేశ్వరము ప్రధాన వ్యాపార కేంద్రముగ నుండెను అట్లే గోదావరి, మంజీర, హరిద్రా నదుల సంగమ ప్రాంతమగు కందుకూర్తి ఆనాడు గొప్ప వ్యాపార కూడలిగ ప్రసిద్ధి గాంచియుండెను

వేములవాడ చాళుక్య రాజుల పాలనాకాలమున గ్రామ పరిపాలనము పటిష్ఠముగ నుండెను. గ్రామ పరిపాలనా బాధ్యత గ్రామ ద్వాదశ మను పండ్రెండు వృత్తుల వారి యధీనమం దుండెను గ్రామాధికారి, న్యాయాధికారి, కరణము, గ్రన్తి, తలారి, జ్యోతిష్యుడు, కుమ్మరి, కమ్మరి, వడ్రంగి, చాకలి, మంగలి, గ్రామోపాధ్యాయుడను ద్వాదశ వృత్తుల వారు గ్రామ ప్రజల అవసరములను చూచుచుండిరి

గ్రామములందు రైతులను, ముఖ్యముగా వ్యవసాయదారుల నాధారముగా గొని ద్వాదశ వృత్తులవారు తమ వృత్తి ధర్మములను నిర్వహించుచుండిరి

గ్రామాధికారి గ్రామమున జరుగు మంచి చెడ్డలకు బాధ్యత వహించుచు గ్రామ రక్షకునిగా వ్యవహరించుచుండెను

గ్రామమున సంభవించు భూ వివాదములకు, కుటుంబ కలహములకు, ఆస్తి పంపకములకు, వారసత్వమునకు సంబంధించిన వివాదములను న్యాయాధికారి పరిష్కరించుచుండెను

గ్రామ పరిధిలోనున్న భూములపై విధించు పన్నుల లెక్కలను, తదితర సుంకముల లెక్కలను చూచువాడు కరణము. పన్నులను విధించుచు, కరువు కాటకములందు రాజాజ్ఞల ననుసరించి, విధించిన పన్నులలో కొంత తగ్గించి రైతులకు సహకరించుచు, వారి నుండి న్యాయ సమ్మతమైన పన్నులను వసూలు చేయుటలో సహకరించు కరణముల కానాడు గౌరవాదరములుండెను.

గ్రామ పరిధి యందున్న వ్యవసాయయోగ్యమైన పొలములకు నీరు నిచ్చుచు, గ్రామ తటాకములపైనను, చిన్న చిన్న జలాధారములపైనను అధిపత్యము నెరపువాడు గ్రన్తి

తలారి లేక తలవరి గ్రామ రక్షణ బాధ్యత వహించుచు గ్రామ రక్షకు డనబడుచుండెను దొంగతనములు, దోపిడులు జరుగకుండ, నిత ద(ప్రమత్తుడై యుండెడివాడు ఒకవేళ గ్రామమం దట్టి సంఘటనలు సంభవించిన యెడల గ్రామ రక్షకుడు బాధ్యత వహించి, దొంగలను పట్టి బంధించు చుండెను దోపిడులలోను, దొంగతనములయందును నష్టపడిన వారికి నష్ట పరిహారము చెల్లించు పద్ధతి ఆనాడుండెను

వ్యవసాయపు పనిముట్లు, లోహ పరికరములను గ్రామీణుల అవసరమునకు చేసి యిచ్చువాడు కమ్మరి గృహోపకరణములు, ఆయుధములు, ముఖ్యముగా కత్తులు, ఈటెలు, తయారు చేయుటలో కమ్మరులు నేర్పరులై యుండిరి

కుండలు, బానలు, గూనలు, వంట పాత్రలు, గాదెలు తయారుచేసి యిచ్చువాడు కుమ్మరి. నాణ్యమైన మట్టికుండలను, బానలను తయారుచేసి, వాటిపై రకరకముల రంగులతో, పలు విధములైన చిత్రములను రూపొందించెడివారు ఆ నాటి కుమ్మరులు చక్కని నేర్పు కలిగి, సుందరమైన మట్టి కుండలను తయారు చేసెడివారు గ్రామీణులిచ్చు కట్టడి ధాన్యముతో గాని, మట్టి పాత్రల నమ్మిన వచ్చు ప్రతిఫలముతో గాని కుమ్మరులు జీవించుచుండిరి

వడ్రంగి, చాకలి, మంగలి తమ తమ కుల వృత్తులను నిర్వహించుచుండిరి.

వ్యవసాయ దారులకు శుభా శుభ ఫలములను తెలుపుచు, ఏ కార్తిలో ఏ ఏ తిథులందు విత్తనములు చల్లుట, నాట్లు వేయుట, సాగుబాటు చేయుట వంటి సమాచారమును తెలుపువాడు జ్యోతిష్యుడు ఇతడు, వివాహాది శుభకార్యములకు ముహూర్తములు నిశ్చయించెడివాడు

గ్రామోపాధ్యాయుడు గ్రామములోగల విద్యార్థులకు విద్యాబోధ చేయుచుండెను వీరుగాక ఇతర వృత్తుల నవలంబించువారును గ్రామములందు నివసించు చుండిరి కొన్ని గ్రామములందు అష్టాదశ వృత్తులవా రుండిరి

వేములవాడ చాళుక్యులు ద్వాదశ వృత్తుల వారికి, అష్టాదశ వృత్తుల వారికి మాన్యము లిచ్చు పద్ధతి నమలులో నుంచిరి ప్రభుత్వమువారిచ్చిన మడి మాన్యములనుండి వచ్చు ఆదాయమునకు తోడు గ్రామరైతులు, ప్రజలు యిచ్చు కట్టడి ధాన్యము ఈ వృత్తుల వారి జీవనమున కాధారముగ నుండెడిది.

యుద్ధ సమయములందు గ్రామ ప్రజలు, ద్వాదశ వృత్తులవారు ప్రభుత్వాధికారుల కండగా నిలిచి, యుద్ధ సామగ్రిని ఒకచోటు నుండి మరియొక ప్రదేశమునకు చేర్చుటలో సహకరించెడివారు

ఆనాడు సాగు భూమి, బంజరు భూమి, అడవి, అను మూడు రకముల భూములుండెను. బంజరుభూమి బీడు భూమిగా నుపయోగపడుచుండెను ఈ భూములలో గడ్డి ఏపుగా పెరుగుచుండెను. గ్రామీణుల పశువులు వ్యవసాయదారుల పశువు లీ బంజరు భూములలో పెరిగిన గడ్డి మేయుచుండెను ప్రతి గ్రామము, కొంత బంజరు భూమిని కలిగియుండెను భూమి లేనివారు రాజాజ్ఞను గొని బంజరు భూములను సాగు చేసికొనుచుండిరి రైతులు భూమిని లోతుగా దున్ని, చక్కగా పైరు ఎదుగునట్లు ఎరువులు వేయుచు ఎక్కువ పంటలను పండించుచుండిరి

భూస్వాములు స్వయముగా వ్యవసాయము చేయుచుండిరి కొందరు రైతులు ప్రభుత్వము నుండి గాని, భూస్వాములనుండి గాని కమతమునకు, లేక కౌళ్ళకు భూమిని తీసికొని వ్యవసాయము చేయుచుండిరి భూస్వాములు రైతులకు, భూమి లేనివారికి తమ భూములను కౌళ్ళ కిచ్చినను, భూమి పన్నును మాత్రము వారే ప్రభుత్వమునకు చెల్లించుచుండిరి

ఆనాడు భూ వివాదములు తక్కువ సంఖ్యలో నుండెను గట్టు రాప్పు, భూమి సరిహద్దులుగా నుండెను సరిహద్దు కలహములుగాని, భూ సంబంధమైన వాద వివాదములు గాని ఆనాడు లేకుండెను అట్టి వాద వివాదములు తల యెత్తిన గ్రామమందున్న న్యాయాధికారి వాటిని పరిష్కరించుచుండెను. నాటి గ్రామ పరిపాలనము ప్రజా తంత్ర పరిపాలనమువలె, గణతంత్రరాజ్యపాలనమువలె నుండెను ఆనాటి గ్రామములు స్వయంపోషకములుగ నుండెను

నాటి రాజ మార్గములు వ్యాపారాభివృద్ధికి తోడ్పడునట్లుండెను వేములవాడ చాళుక్యుల రాజ్యమునం దనేక రాజ మార్గములుండెను. పోదన నగరము నుండి గంగాధర మీదుగా, వేములవాడకు రాజమార్గము నిర్మింపబడి యుండెను అట్లే వేములవాడ నుండి కాళేశ్వరమువరకు మరియొక మార్గముండెను రాజ్యమందన్ని ముఖ్య పట్టణములను కలుపు రాజమార్గములను ఈ రాజ వంశీయులు నిర్మించి యుండిరి

గోదావరి నదిపై ప్రయాణించు వర్తకులు, తైర్థికులు సమస్త సదుపాయములను కలిగి యుండిరి. భారీ వ్యాపారములపై పెద్ద సుంకము విధించుచుండిరి ఈ సుంకము హెజ్జుంక లేక పెర్జుంక యనబడినది.

చిన్న చిన్న వర్తకులు చేయు వ్యాపారముపై విధించు పన్నును కిరుపుల సుంకమను చుండిరి. ప్రభుత్వమునకు చెల్లించు పన్ను లధికముగా నున్నను ప్రశాంత వాతావరణమున ప్రజలు జీవించు చుండిరి.

భూసారము ననుసరించి పండిన పంటలో 1/6 వ వంతు, 1/8 వ వంతు, 1/12 వ వంతు పన్ను రూపమున వ్యవసాయదారుల నుండి వసూలు చేయుచుండిరి పశువుల వ్యాపారులు, స్వర్ణ, రజత వ్యాపారులు. తమ ఆదాయమున సగము భాగము ప్రభుత్వమునకు చెల్లింపవలసియుండెను

వక్కలు, ఘృతము, రసగంధము, ఔషధములు, పూవులు, పాత్రలు, మట్టిపాత్రలు, చర్మము వంటి వస్తువులపై వచ్చు ఆదాయమును పరిగణలోనికి తీసికొని దానిపై ఆరవ వంతు పన్ను వసూలు చేయుచుండిరి

జైనాచార్యులు, జైనమునులు, తీర్థంకరులు, వేదవిదులైన విప్రులు పన్నులు చెల్లింప నవసరము లేకుండెను రాజ్యమందున్న బీడు భూములు పశువులు మేయుటకు పన్నుల నుండి మినహా యింపబడియుండెను

పల్లెపట్టులందును, గ్రామసీమలయందును పంచాయతీ వ్యవస్థలుండెను ఇట్టివి పంచాయతీ సభలనబడుచుండెను ఈ గ్రామ సభా సభ్యులు రాజుచేగాని, రాజప్రతినిధిచేగాని నియమింపబడు

చుండిరి సర్వశాస్త్ర సంపన్నులు, ధార్మికులు, నిత్య సత్యవచనులు, లౌకిక విషయముల నెఱింగినవారు, ధైర్యవంతులు, విచక్షణాజ్ఞానమున్నవారు, బంధుప్రీతి, ఆశ్రిత పక్షపాతము లేనివారు, మిత్రామిత్రులందు సమదృష్టిని చూపువారు పంచాయతీ సభలయందు సభ్యులుగా నియమింపబడుచుండిరి

ఈ గ్రామ పంచాయతీ సభలలో నియమింపబడిన సభ్యులు స్వయముగా గాని, ప్రత్యేక సమయములందు రాజుతో కలిసి గాని, రాజ ప్రతినిధులతో కలిసిగాని, ప్రభుత్వోద్యోగులతో కలిసి గాని తగవులు పరిష్కరించుచుండిరి

ఈ సభ్యులు మచ్చరము లేక, కులీనులై, శీల గుణసంపన్నులై, వయోధిపులై, ధనాఢ్యులై యుండవలెను ఇట్టివారు బ్రాహ్మణులుగాని, వైశ్యులు గాని, తదితరులుగానినై యుండవచ్చును

సభాపతి లేక న్యాయాధిపతి, ఇంగిత జ్ఞానము కలిగి, ఊహాపోహ లెఱింగి, ప్రాడ్వివాకుడైన బ్రాహ్మణుడై యుండవలెను. రాజుగాని, రాజుచే నియమింపబడిన అధికారిగాని లేని సమయములందు న్యాయాధిపతిగా నితడు బాధ్యతలు నిర్వర్తించును విప్రుడు లేని సమయములందు ఇట్టి గుణ సంపద గల వేరొకనిని న్యాయాధిపతిగను లేక విచారణకర్తగను నియమించుచుండిరి శూద్రుడు న్యాయాధికారిగా నుండుట కనర్హుడు

వాది ప్రతివాదుల నెదురెదురుగా నిలిపి విచారణ జరుపుచుండిరి శృతి స్మృతి శాసనముల నాధారముగా గొని విచారణ సలిపి తీర్పు నిచ్చుచుండిరి

సాక్షులు లేని సమయమందు దివ్యముల నిచ్చుచుండిరి అనగా అగ్ని, తైలాది పరీక్షలు జరుపుచుండిరి తప్పులు చేసిన వారికి తగిన శిక్ష లభించుచుండెను

కులట, రజస్వల, ప్రసూత, యువతి సభాస్థలి ప్రవేశమున కనర్హులుగా నుండిరి అనేక విప్ర కుటుంబముల వారు విద్యా వినయ సంపన్నులై, పంచాయతీ సభల కధ్యక్షులుగా నుండిరి.

వేములవాడ చాళుక్యుల రాజ్యమున ధాన్యాదులను కొలుచుటకు రాజముద్రికలు గల కొల పాత్రలు వాడుకలో నుండెను. నేడు సీలుకుంచములు, కిలో కొలపాత్రలు, తూకములు వాడుచున్నట్లే ఆనాడు కొలపాత్రలుండెను భూమి కొలతలకు ప్రత్యేకమైన దీర్ఘ కొలమానములుండెను.

ఈ రాజన్యులు విద్యావంతులకు, శిల్పులకు, కళాకారులకు, గణిత శాస్త్రజ్ఞులకు, జైన మునులకు, జైనాచార్యులకు, వైదిక బ్రాహ్మణులకు భూసువర్ణాగ్రహారములను దానమిచ్చుచుండిరి. రాజులు, వారి అనుయాయులు, కవులు, కవుల బంధువులు, దేవాలయములను, జైన బసదులను నిర్మించి, ఆలయముల నిర్వహణకు, జైన బసదుల వసతులకు భూ సువర్ణ దానము లిచ్చుచుండిరి

ఆనాడు వేములవాడ రాజ్యమున వడ్డీ వ్యాపారము విశేషముగ సాగుచుండెను ఈ వృత్తిలో నున్న వ్యాపారులు ప్రజలనుండిగాని, వ్యాపారులనుండిగాని తక్కువ వడ్డీ తీసికొనుచుండిరని శాసన ముల వలన తెలియుచున్నది

గద్యాణము,హాగ ఆనాడు వాడుకలోనున్న నాణెములు బంగారు, వెండి నాణెములు సైతము వాడుకలో నుండెను వేములవాడ రాజ్యమున వర్తక సంఘములు, శిల్పకార సంఘములు, మహాజన సంఘములుండెను ఆయా సంఘము లాయా సంఘ సభ్యుల అభ్యున్నతికి కృషి చేయుచుండెను

ఆనాటి రాజనీతి స్వారాష్ట్రికము, పార రాష్ట్రికమని రెండు తెరగులుగ నుండెను స్వారాష్ట్రిక నీతి రాజ్యపాలనా పరముగను, పార రాష్ట్రిక నీతి సంధి విగ్రహరీతుల ననుగుణముగను నుండెను రాజులు, రాజాధిరాజ, రాజ పరమేశ్వర, పరమభట్టారకాది బిరుదములు వెలిగియుండిరి జైన మతానుయాయులైన రాజులు జైనాచార్యుల, జైన తీర్థంకరుల భక్తులుగ వర్ణింపబడినారు

సామంత మాండలికులు, దుర్గాధిపతులు వేములవాడ ప్రభువులకు పన్నులు, కానుకలు చెల్లించుచుండిరి యుద్ధ సమయములందును, విపత్కర పరిస్థితుల యందును మాండలిక రాజులు దుర్గాధ్యక్షులు, సామంతులు సైన్య సహాయ మొనర్చుచు యుద్ధములందు స్వయముగా పాల్గొను చుండిరి

రాష్ట్రకూట చక్రవర్తుల సామంతులుగా వేములవాడ చాళుక్యులు చక్రవర్తి సైన్యముల కధ్యక్షులుగనుండి అనేక యుద్ధము లొనర్చి విజయములు సాధించిరి ఆనాటి రాజులకు సహాయముగా ప్రధానామాత్యునితో కూడిన మంత్రి మండలి యుండెడిది రాజు, మంత్రులు పరస్పరము విషయములను చర్చించి, ప్రజోపయోగ నిర్మాణ కార్యక్రమముల నమలుపరచు చుండిరి మంత్రిమండలి సమావేశము లకు రాజు అధ్యక్షునిగా నుండెడివాడు

## సైనిక వ్యవస్థ :

వేములవాడ ప్రభువులు తమ అధీనమున కొంత స్వంత సైన్యమును నిలుపుకొని వారికి స్వయముగా జీతబత్తెముల నిచ్చుచుండిరి ఇట్టి సైన్యము స్వంత సైన్య మనబడినది

అత్యవసర పరిస్థితులందును, యుద్ధ సమయములందును, సామంత మాండలికులు రాజునకు సైన్య సహాయమొనర్చుచుండిరి సైన్యమున విభాగములుండెను

సామంత మాండలికులు, దండ నాయకులు, దుర్గాధీశులు సేనా నాయకులుగ వ్యవహరించు చుండిరి. మాండలికులపై మహామండలేశ్వరు డాధిపత్యము వహించుచుండెను సంధి విగ్రహి

తంత్రపాలుడు మున్నగు సైన్యాధికారులు సైనికులను క్రమశిక్షణలోనుంచి, యుద్ధ వ్యూహ రచనలను, యుద్ధ తంత్రములను, యుద్ధ రహస్యములను బోధించుచుండిరి శత్రు రాజులు దండెత్తి వచ్చినపుడు మాండలికులు, సామంతులు, దుర్గాధిపతులకు సైన్య సహాయమొనర్చుచుండిరి

యుద్ధ సమయములందు గజములకు, గుఱ్ఱములకు, వీరులకు మధువును ఇచ్చుచుండిరి యుద్ధమునకు పురుషులతోపాటు స్త్రీలు సైతము వచ్చుచుండిరి అశ్వములకు శరీర రక్షణార్థము కవచములు తొడుగుచుండిరి

సైనికులు శిరస్త్రాణములు, కవచములు ధరించెడివారు యుద్ధరంగమును వీడి పరువెత్తు సైనికులకు స్త్రీ వేషము వేసి అవమానపరచు చుండిరి యుద్ధ సమయములందును, యుద్ధ విజయానంతరమును స్త్రీ శిశు బాల గో బ్రాహ్మణ వృద్ధ పరిజనులను హింసింప రాదను నియమ ముండెను

రాజు, దుర్గాధ్యక్షుల యధీనమున కొంత సైన్యముంచి, ఆ సైన్యమును నిర్వహించుటకు ధనమును గాని కొన్ని గ్రామములను గాని ఇచ్చుచుండెను దుర్గాధిపతి పరిధిలో నున్న సైన్యము దుర్గ రక్షణ బాధ్యత వహించుచు ఆ దుర్గము పరిధిలోగల ప్రాంతములం దల్లరులు గాని శత్రు రాజులవలన భయము గాని లేకుండ చూచుచుండెను

యుద్ధములు సర్వ సాధారణముగా శరత్కాలమున జరుగుచుండెను యుద్ధములందు భేరి వాద్యములు వాయించుచుండిరి శకునములను పాటించుచుండిరి ముహూర్తములను నమ్మి, తిథి వార నక్షత్ర ఘడియ విఘడియలను పాటించి యుద్ధమునకు బయలుదేరెడివారు

రాజులు దండయాత్రలకు బయలుదేరు సమయమునను, యుద్ధకాలమందును దానధర్మములు చేయుచుండిరి రాత్రులందు యుద్ధములు నిషేధింపబడియుండెను స్త్రీలను అంతఃపురములం దుంచి వారి రక్షణకు సైన్యము నుంచెడివారు వేములవాడ చాళుక్యుల పాలనాకాలమున రథముల కన్నను గజముల కన్నను హయ, పదాతి దళములు ముఖ్యమైనవిగా భావింపబడుచుండెను

## మత పరిస్థితి :

వేములవాడ చాళుక్యుల కాలమున జైన, వైదిక, బౌద్ధ మతములు వర్ధిల్లినవి ఈ రాజన్యులు జైనమతావలంబకులు కావున జైనమతము నాదరించి పోషించుటయే గాక అనేక జైన బసదులను జినాలయములను నిర్మించుటలో తోడ్పడినారు

ఆనాడు జైనమతమున వర్ణ వ్యవస్థకు స్థాన మేర్పడి యుండెను బాదామీ చాళుక్యుల యనంతరము రాష్ట్రకూటులు రాజ్యాధికారము వహించిరి రాష్ట్రకూటులు పాలించు కాలమున చాళుక్యుల నాటి మత పరిస్థితులు సామ్రాజ్యమందంతట నెలకొని యుండెను.

రాష్ట్రకూటుల సామంతులుగ నున్న వేములవాడ చాళుక్యుల రాజ్యమున జైనమతముతో పాటు వైదిక మతము, బౌద్ధము వృద్ధి చెందినవి

వేములవాడ చాళుక్యులలో అధికులు జైనమతావలంబకులు మరికొందరు శైవులు రెండవ అరికేసరి ఆస్థానమున పంప మహాకవి యుండెను అతని సోదరుడు జినవల్లభుడు జినవల్లభుడు వేయించిన కుర్క్యాల శిలాశాసనము[1]వలన రెండవ అరికేసరి మహారాజు పంప మహాకవికి ధర్మపురి నగ్రహారముగ నిచ్చినట్లును, జినవల్లభుడు జైన మందిరములను నిర్మించి తటాకములు త్రవ్వించి, జైనమతాభిమానమును ప్రకటించినట్లును తెలియచున్నది

కన్నడ భాషలో మహా భారతమును రచించిన పంప మహాకవి తెలుగు బ్రాహ్మణుడు వేములవాడ చాళుక్యులు పాలించిన రాజ్యము తెలుగు సీమలోనిది జైనులలో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర అను వర్ణముల వారుండిరి వైదిక మతస్థు లేవర్ణమునకు చెందినవారైనను జైన మతము నవలంబించిన పిదప పూర్వ వర్ణ ధర్మముల నాచరించు చుండిరి

వేములవాడ చాళుక్య రాజులు పాలించిన కాలమున వైష్ణవ పూజలు, సూర్యారాధనము అమలులో నుండెను. గుళ్ళు, గోపురములు, మఠములు, బసదులు, ఆలయములు ఆయా మతపద్ధతుల ననుసరించి నిర్మింపబడుచుండెను

మొదటి అరికేసరి మహారాజు ఏలేశ్వర నివాసి యగు ముగ్ధ శివాచార్యునకు బెల్మొగ గ్రామమును దానమిచ్చినట్లు కొల్లిపర శాసనము తెలుపుచున్నది వేములవాడలో నిర్మించిన రాజేశ్వరాలయము, బద్దిగేశ్వరాలయము ఈ రాజ వంశీయుల పేర నిర్మించినట్టివి ఇచట రెండవ అరికేసరి పాలనా కాలమం దొక సూర్యదేవాలయ నిర్మాణము జరిగినది

## విద్యావైదుష్యములు :

వేములవాడ చాళుక్య రాజులు పాలించు కాలమున కన్నడము రాజభాషగా వర్ధిల్లినది తెలుగు భాష జన వ్యవహారమున నుండెను వీరి పాలనాకాలమున ప్రకటింపబడిన శాసనములలో నత్యధికము కన్నడ భాషలో నున్నవి ఈ కాలమున తెలుగు భాషలో పద్యములు రచింపబడినవి

వేములవాడ చాళుక్యులలో పేరెన్నిక గలవాడు రెండవ అరికేసరి ఇతని ఆస్థానకవి పంపడు. పంపకవికి కవితాగుణార్ణవుడను బిరుద ముండెను. ఇతని యనుజుడు జినవల్లభుడు

---

1 ఈ శాసనము గంగాధర శిలాశాసనముగ భారతి - మార్చి 1967 పుటలు 10-23 లో ప్రకటింపబడినది

ఇతడు సకల శాస్త్రవిదుడు భవ్య రత్నాకరుడు గుణ పక్షపాతి చతుర కవిత్వ రచనా నిపుణుడు. వివిధ వాక్యరచనా దురంధరుడు కవిత్వతత్వ విచారవేత్త ఆచార్యుడు సంగీతశాస్త్ర పారంగతుడు జినభవనములు నిర్మించుటలో నేర్పరి

జినవల్లభుడు వేయించిన కుర్క్యాల శిలాశాసనమున మూడు కంద పద్యములున్నవి ఇవి తెలుగు భాషలో వ్రాయబడినవి ఈ పద్యములు తెలుగు సాహిత్యమున మొట్టమొదట వ్రాయబడిన కంద పద్యములుగా భావింపవచ్చును

తెలుగు కవిత క్రీ శ 575 నాటి నుండి శాసనస్థమై వచ్చినది రేనాటి చోళుల శాసనములలో కొన్ని వృత్తగంధి పద్యములున్నవి మధ్యాక్కరలున్న శాసనములు వీరి కాలమున ప్రకటింపబడినవి తూర్పు చాళుక్యరాజులు వేయించిన శాసనములందు తరువోజ, సీసము, మధ్యాక్కర వంటి పద్యములు స్థానమును పొందినవి

తెలంగాణమున తెలుగు రాజుల పరిపాలన మానాడు లేకుండెను బాదామీ చాళుక్యులు, రాష్ట్రకూటులు, వేములవాడ చాళుక్యులు కన్నడమును రాజభాషగా గ్రహించి పాలించిరి ప్రజలు మాట్లాడు భాష తెలుగేయైనను రాజ శాసనము లన్నియు కన్నడ భాషలో నున్నవి ఒక్క జినవల్లభుని కుర్క్యాల శాసనమున మూడు కందపద్యములున్నవి ఈ శాసనమున సంస్కృతాంధ్ర కన్నడ భాషలలో గద్య పద్యములున్నవి

క్రీ శ ఆరవ శతాబ్ది నుండి తెలుగు భాషలో కవిత్వము వర్ధిల్లుచు వచ్చినది వేములవాడ చాళుక్యుల పాలనా కాలమున తెలుగులో గ్రంథములు రచింపబడినవి కన్నడభాషకు వీరి పాలనాకాలము స్వర్ణయుగము వంటిది

జినవల్లభుడు సంస్కృతాంధ్ర కన్నడ భాషలయందు నిష్ణాతుడు అతడు గంగాధరకు చేరువలో నున్న కుర్క్యాల గ్రామ పరిధి బొమ్మలమ్మగుట్టపై నొక శాసనమును చెక్కించెను ఈ శాసన మొక గుండ శిలపై నున్నది ఈ శాసనమందలి మూడు కందపద్యములు తెలుగుభాషలో ప్రాచీనములుగా భావించుట కవకాశమున్నది ఈ శాసన మందలి కంద పద్యము లిచట నుదాహరింప బడుచున్నవి

కన్దం॥ జినభవనము లెత్తించుట
జిన పూజల్సేయుచున్కి జినమునులకు న
త్తిన యన్నదానం బీవుటం
జినవల్లభు బోలం గలరె జిన ధర్మపరుల్ 1.

దినకరు సరివెల్గుదు మని
జినవల్లభునెట్టు నెత్తు జిత కవిస నను
మనుజుల్గలరె ధాత్రిం
వినితిమ్చదునని యవృత్త విబుధ కవీంద్రుల్. 2

ఒక్కొక్క గుణంబు కల్గుదు
రొక్కణ్ణంగా కొక్కలక్కలే వెవ్వరికిం
లెక్కింప నొక్క లక్కకు
మిక్కిలి గుణ పక్షపాతి గుణమణి గణంబుల్ 3

పై మూడు పద్యములలో మొదటి రెండు పద్యములు తెలుగు కవితా సంప్రదాయము ననుసరించి యతిప్రాసలతో కూడియున్నవి మూడవ దానిలో ప్రాస యున్నది కాని యతి లేదు

తెలుగు భాషా పదములు తత్సమ పదములతో కలిసి పదియవ శతాబ్ది నాటికి మల్లియ రేచన కవిజనాశ్రయము, నన్నెచోడుని కుమార సంభవము వంటి గ్రంథములందు స్థానమాక్రమించినవి

సంస్కృత భాషా ప్రభావమున తెలుగు భాష తొలుత శాసనములందు వాడబడినది తరువాత గ్రంధరచనా యోగ్యమగు భాషగా వర్ధిల్లినది చాళుక్యుల కాలమున మొదట ప్రాకృత భాషా ప్రభావము తెలుగుభాషపై నుండెను అనేక శాసనములు ప్రాకృత పద సమ్మిశ్రితమైన తెలుగు పదములతో కూడియున్నవి. అటు పిమ్మట సంస్కృతాంధ్ర పదములతోకూడిన శాసనములు, శాసనములందు చివరగా తెలుపునట్టి గ్రామ సరిహద్దులు వెలసినవి

ఈ కాలమున ప్రకటింపబడిన శాసనములలో కొన్ని సంస్కృత పద బాహుళ్యము కలవి మరికొన్ని ప్రాకృత పద సంపద కలవి ఆయా కాలములలో వేయించిన శాసనములు ఆయా భాషల ప్రభావమును సూచించుచుండుట వలన తెలుగు భాష కాలానుగుణముగ మారినదని చెప్పవచ్చును.

వేములవాడ చాళుక్యులు సాహిత్య ప్రియులు వీరు కవి పండితులను, శిల్పులను పోషించినారు. కన్నడ భాషలో కావ్యములు రచించిన పంప మహాకవి ఆంధ్ర బ్రాహ్మణుడు. జైనమతావలంబి. కమ్మ నాటిలోని వేంగిపట్టు గ్రామమున జన్మించినవాడు.

పంపమహాకవి రెండవ అరికేసరి దండనాధునిగ నుండి, కత్తిని కలమును నడిపించినవాడు. రెండవ అరికేసరి మహారాజు వలన ధర్మపురి నగ్రహారముగ బడసినవాడు.

పంపకవి మహాభారతమును విక్రమార్జున విజయమను పేర జైన మత పరముగా కన్నడ భాషలో రచించి అరికేసరి మహారాజున కంకితమిచ్చెను ఇతని రెండవ కావ్య మాదిపురాణము ఇందు జైన తీర్థంకరుల చరిత్రలు వర్ణింపబడినవి.

సోమదేవ సూరియను జైనకవి క్రీ శ 950 ప్రాంతమున గంగాధర పట్టణమున నివసించి యుండెను ఇతడు యశస్తిలక చంపువును రచించెను ఇతడు సంస్కృత భాషా కోవిదుడు సంస్కృత కవితా విశారదుడు నీతి కావ్యమను రాజనీతి గ్రంథము నితడు రచించెను ఈ మహాకవి రచన శబ్దార్థాలంకారములతో శోభిల్లుచుండును సోమదేవ సూరి యశస్తిలక చంపువువలన ఆనాటి మత, సాంఘిక పరిస్థితులు తెలియుచున్నవి దక్షిణాపథమందలి ఆనాటి ప్రజల సంస్కృతి, ఆచార వ్యవహార ములు, నాగరికత, సభ్యత వంటి విషయములు ఇందున్నవి

శాంతి పురాణము, రామాభ్యుదయములను గ్రంథములను రచించిన పొన్నకవి, గదా యుద్ధము, అజిత పురాణములను రచించిన రన్నకవి, పంపమహాకవి కన్నడభాషా కవులలో రత్న త్రయమని పేరుపొందినారు రన్నకవిని కన్నడ భాషాభిమానము గల మల్లపయ్య కుమార్తె అత్తిమాంబ ఆదరించి పోషించెను

క్రీ శ 13 వ శతాబ్ది ఉత్తరార్థము నాటికి తెలుగుకన్నడ భాషల కొకే లిపి యుండెడిది తెలంగాణ ప్రాంతమున కన్నడము రాజభాషగా వర్థిల్లియుండెను తెలుగు ప్రజలు తమ మాతృభాషలో నిత్య వ్యవహారములను నిర్వహించినను, రాజభాషలో శాసనములను ప్రకటించియుండిరి ఆనాడు అర సున్న వాడుకలో లేదు దీనిబదులు పూర్ణానుస్వారమే వాడబడినది ద్విత్వాక్షరము లుపయోగింపబడినవి దేశి, మార్గ కవితలు రూపుదిద్దుకొనినవి

వేములవాడ చాళుక్యులు మహా విద్వాంసులకు, పండితులకు, కవులకు, మతాచార్యులకు అగ్రహారముల నిచ్చి సత్కరించినారు. వీరి కాలమున కన్నడ భాష మహోన్నతస్థాయి కెదిగినది

## వర్తక వ్యాపారములు :

వేములవాడ చాళుక్యుల కాలమున వర్తక వ్యాపారములు విశేషముగ సాగుచుండెను కొంత కాలము ఈ రాజన్యుల యధీనమున నల్లగొండ మండలములోని పెరూరు ప్రాంతముండెను

ఆ కాలమున ఎద్దులపైనను, దున్నలపైనను, గుఱ్ఱములపైనను ధాన్యపు పెరికలను ఒకచోటు నుండి మరియొక చోటికి తీసికొని పోవుచుండిరి విదేశ వ్యాపారము నావలపై జరుగుచుండెను కాళేశ్వ రము మహా క్షేత్రము ఈ క్షేత్రము వేములవాడ చాళుక్యుల రాజ్యమందుండెను. సిరివంచ, చెన్నూరు,

సబ్బిసాయిర మండలము, మంత్రకూటము మున్నగు పట్టణముల నుండి వచ్చు వ్యాపారులకు కాళేశ్వరము కూడలిగా నుండెను

కాళేశ్వరము త్రిలింగ క్షేత్రములలో ప్రథమ గణ్యమైనది త్రిలింగ క్షేత్రములుగ కాళేశ్వరము, ద్రాక్షారామము, శ్రీశైలము ప్రసిద్ధిగాంచినవి ప్రణీతానది కాళేశ్వర క్షేత్ర సమీపమున గోదావరి నదిలో సంగమించుచున్నది

చెన్నూరు పట్టణము వేములవాడ చాళుక్యుల సామంతులకు కేంద్ర స్థానమైయుండెను ఇచటి అగస్త్యేశ్వరాలయమున రెండవ అరికేసరిని పేర్కొను ముదిగొండ చాళుక్య రాజగు ద్వైగుడు వేయించిన క్రీ శ 941 నాటి శాసనమున్నది

పెదూరు అహల్యా నదీ తీరమందున్న పట్టణము ఇచటి సోమేశ్వరాలయము సుప్రసిద్ధమైనది, అహల్యా నది కృష్ణానదిలో సంగమించు ప్రాంతమున కతి చేరువలో పెదూరు పట్టణమున్నది. ఇచట దేశ విదేశ వ్యాపారులు నివసించుచుండిరి వారు నావలలో అహల్యానదిపై పయనించి కృష్ణానదిగ మించి తూర్పు సముద్రమును చేరి అచటినుండి ప్రాగ్దేశములకు వెళ్ళి వ్యాపార మొనర్చుచుండిరి

ఆనాడు వర్తక సంఘములుండెను ఈ సంఘములు వర్తకుల క్షేమమునుగోరి వారికి సమస్త సదుపాయము లేర్పరచు చుండెను వర్తకులలో గల అభిప్రాయభేదములను, వ్యాజ్యములను వివాదములను పరిష్కరించుటలో వర్తక సంఘములు లేక వర్తక శ్రేణులు లేక సమయములు ప్రధాన పాత్ర వహించు చుండెను

వర్తక సంఘముల వారే కాక, అనేక వృత్తుల నవలంబించువాడు తమ తమ శ్రేయస్సునకు సంఘములను స్థాపించుకొని యుండిరి ఈ వర్తక సంఘములు వ్యాపారుల నుండి క్రయ విక్రయముల పరిమితుల ననుసరించి ద్రవ్యమును వసూలు చేయుచుండిరి ఇట్టి ద్రవ్యము ధర్మనిధిగా పరిగణింప బడుచుండెను

భూ జల మార్గమున జరుగు విశేష వ్యాపారము వలన వేములవాడ చాళుక్యుల కార్థికముగా ఎక్కువ లాభము కలుగుచుండెను వర్తకుల భద్రతకు, ప్రభుత్వాధికారు లనేక చర్యలను తీసికొను చుండిరి ఆనాటి వ్యాపార కూడలులందు సమస్త వస్తు విక్రయ క్రయములు జరుగుచుండెను

## సాంఘిక స్థితి :

తెలుగుదేశము విశాలమైనది సుసంపన్నమైనది ప్రత్యేకమైన సంస్కృతిగల ప్రజానీకముతో నలరారుచు ప్రపంచమునకు, ముఖ్యముగా ప్రాగ్దేశములగు మలయా, సుమత్రా, జావా, సింహళాది ద్వీపములకు, కంబోడియా, సయాం, బర్మా, జపాన్, చైనా దేశములకు, బౌద్ధమతము వర్ధిల్లిన కాలము నుండి, భారతీయ సంస్కృతిని పంచిపెట్టిన దేశ మాంధ్రదేశము

చెంగుసీనునుండి బౌద్ధ మతాచార్యులు, ప్రచారకులు హైందవ మత సిద్ధాంతములను, బౌద్ధ మత ధర్మములను ప్రాగ్దేశములందు వ్యాపింపజేసియుండిరి ఈ మతాచార్యులవలన, మత ప్రచారకుల వలన ఆయా దేశములందున్న ప్రజలు విద్యావంతులై, నాగరికులై భారతీయ సంస్కృతి నాదరించిరి

కార్మికులు, సంపన్నులు, సకల కళాప్రవీణులు, వ్యాపారదక్షులును నగు ఆంధ్రులు ప్రాచీన కాలమునుండి నేటివరకు సహనభావము కలిగి, అన్ని మతములవారి కాశ్రమిచ్చుచు, ఆదరించుచు భారతదేశమందలి జాతులలో ఆంధ్రజాతి శక్తి సమన్వితమైన జాతిగా పేరొందునట్లు ప్రవర్తించినారు

వేములవాడ చాళుక్యులు ప్రజాక్షేమమును గోరి పాలించుటయేగాక ప్రజల సుఖదుఃఖములలో భాగస్వాములుగ నుండి తమ పరిపాలనా కాలము ఆదర్శవంతమైనదిగా పొగడబడునట్లొనర్చినారు

రాజుల స్నాన గృహములు స్ఫటిక వేదికలతో, కాచకుట్టములతో, చిత్ర విచిత్ర చిత్రములతో మెరిసెడి స్తంభములతో శోభిల్లుచుండెను రాజులు, మంత్రులు, ధనాఢ్యులు రోజు విడిచి రోజు అభ్యంగన స్నానము చేయుచుండిరి విదియ, దశమి, ఏకాదశి తిథులందు అభ్యంగన స్నానము నిషేధింపబడియుండెను

అభ్యంగన స్నాన సమయమున వాడునట్టి నూనె శరీరారోగ్యమును దృష్టియందుంచుకొని తయారుచేయుచుండిరి అనేక రకములైన పుష్పములను, సుగంధ ద్రవ్యములను నువ్వుల నూనెలోవేసి కాచి, వడబోసి ఉపయోగించుచుండిరి

ఆనాటి ప్రజలు, రాజాంతఃపురము లందున్నవారు, ధనికులు, ఉన్నతాధికారులు శ్రేష్టమైన నలుగు పిండిని సిద్ధపరచుకొనెడివారు ఈ నలుగు పిండిలో కోష్టము, ముస్తలు, మాచిపత్రి, నందివర్ధనము, వాయింట, మాంసి, మెట్టతామరదుంప, తక్కోలము, నిమ్మ, తులసి, ఆర్జకపు ఆకులు, ఏలకులు, నూవులు, తగిరస, లవంగము, లోధ్ర, శ్రీగంధము, జాజి మున్నగు వంటి వానిని పొడిచేసి, ఆ పొడిని కంది, మినుము, బియ్యము, పెసర కలిపి విసిరిన పిండిలో కలిపి, వస్త్ర కాగితము పట్టి, వసుపు లవణము, నూనె కలిపి స్నాన సమయమున శరీరమునకు వాడుచుండిరి ఇట్టి నలుగు పిండితో స్నానమొనర్చిన శరీరము తేలికపడి, సమధికోత్సాహమున దైనందిన జీవితమును గడుపు అవకాశముండెడిది

ప్రజలు అసాధారణమైన తాంబూలములను ఉపయోగించుచుండిరి పోకలను కర్పూర జలముతో తడిపి కస్తూరిని శ్రీఖండమిశ్రిత చూర్ణముతో శుద్ధిచేసి, ఇతర ద్రవ్యములను కలిపి, ముత్యపు భస్మమును సున్నముగా తాంబూలమున వాడుచుండిరి

పచ్చ కర్పూరము, కస్తూరి, ఘనసార చూర్ణములు, జాపత్రి, జాజికాయలను నూరి, గోళీలను చేసి, తమలపాకులలో వేసికొని సేవించుచుండిరి తాంబూల చర్వణము ఆనాడు సర్వ సాధారణమై యుండెను. రాజులు, రాణివాసపు స్త్రీలు, ధనికులు, మంత్రి సామంత పురోహితాదులు, రాజోద్యోగులు సానులు ఇట్టి విలువైన తాంబూలమును వేసికొనుచుండిరి

వేములవాడ రాజ్యమున రాజాంతఃపుర స్త్రీలకు, రాజబంధువులకు, ప్రభుత్వోద్యోగులకు, సైనికులకు, తదితరులకు కావలసి వస్త్రములు రాజభాండాగారికుడు కొని నిలువయుంచి అవసరమున్న వారి కందించుచుండెను

దేశమందున్న నాణ్యమైన వస్త్రములను వ్యాపారులు తెచ్చి వస్త్ర భాండాగారికునికి మచ్చున కిచ్చి, అతని కోరిక ననుసరించి కావలసిన వస్త్రములను సరఫరా చెయుచుండిరి

ఆనాటి ప్రజలు వివిధమైన వస్త్రములను ధరించుచుండిరి వసంతకాలమున నూలుబట్టలు, నిదాఘకాలమున సన్నని ధవళవస్త్రములు, వర్షాకాలము, శీతకాలములందున్ని బట్టలు ప్రభుత్వోద్యోగులు ప్రజలు ధరించు చుండిరి

ఈ రాజన్యుల కాలమున వేసిన శాసన శిలలపై మత చిహ్నములున్నవి వైదికమతము ననుసరించువారు ప్రకటించిన శాసన శిలలపై వైదిక మతచిహ్నములగు శివలింగము, సూర్యచంద్రులు, వృషభము,డాలు, ఆవు, లేగదూడలు చెక్కించబడినవి

జైన మతమునకు సంబంధించిన రాజులుగాని, మంత్రులుగాని, జైన మత మునులుగాని, మతానుయాయులు గాని వేయించిన శాసన శిలలపై జినవిగ్రహములను, కూష్మాండినీదేవి విగ్రహమును చెక్కించెడివారు. జినవల్లభుని కుర్క్యాల శాసనము చెక్కింపబడిన గండశిలగల కొండను ఆ ప్రాంత మందున్న ప్రజలు బొమ్మలమ్మ గుట్టయని యందురు. కూష్మాండినీ దేవి ప్రక్కనున్న జైనతీర్థం కరుల ననుసరించి, ఆ గుట్టకు బొమ్మలతల్లి గుట్ట లేక బొమ్మలమ్మ గుట్టయను పేరేర్పడినది

వేములవాడ రాజ్యమునేలిన ప్రభువులు, రాజోద్యోగులు, ధనికులు, వర్తకులు, వర్తక సంఘములవారు, రాణివాసపు స్త్రీలు, ధనికవర్గపు స్త్రీలు సన్యాసులకు, జైనబసదులకు, మఠములకు, బ్రాహ్మణులకు, దేవాలయములకు, కళాకారులకు, జైన మఠములకు భూసువర్ణదానము లొసంగుచు శాసనములను వేయించెడివారు ఒక రాజ్యమందున్న ప్రజలు వేరొక రాజ్యములోని పుణ్యక్షేత్రములను దర్శించుటకు తగిన సౌకర్యముల నాయా రాజ్యాధికారులు, రాష్ట్ర పాలకులు ఏర్పరచుచుండిరి

వేములవాడ చాళుక్యుల కాలమున వర్ణ వ్యవస్థ ప్రబలియుండెను జైన మతమును స్వీకరించినవారు తాము పూర్వ మనుసరించుచుండిన మతాచారాములనే పాటించుచుండిరి. విప్రులు, వైశ్యులు, క్షత్రియులు, శూద్రులు అను భేదము లేకుండ అనేకులు జైనమతమును స్వీకరించియుండిరి

వర్ణ వ్యవస్థ స్థిర రూపమును దాల్చియుండుటవలన, సంఘమున సడలని కట్టుబాట్లమలులో నుండెను జైనులు ప్రజల నాకర్షించుటకు తమ మతమున వర్ణ వ్యవస్థ నంగీకరించిరి వర్ణభ్రష్టత లేకుండ ఒక మతము నుండి మరియొక మతములోనికి మారుట కానా దవకాశముండెను

బ్రాహ్మణులు, వేదాధ్యయనము గ్రంథ రచనములతోపాటు క్షాత్ర ధర్మ మవలంబించి, రాజుల వద్ద మంత్రులుగను వీరులుగను, బాధ్యత గల ఉద్యోగులుగను వుండి రాజ కార్యనిర్వహణా బాధ్యతను స్వీకరించిరి

పంప మహాకవి రెండవ అరికేసరి ఆస్థాన కవి అతడు వేములవాడ రాజ్యమున దండ నాయక పదవిని నిర్వహించెను

వేములవాడ రాజ్యమున కన్నడులు, తెలుగు వారు, అన్య రాజ్యముల నుండి వచ్చిన వారు, ముఖ్యముగా మహారాష్ట్రులు, వేంగి దేశవాసులు, తమిళులు, వేములవాడ రాజ్యమున స్థిరపడి యుండిరి

రాష్ట్రకూటులు నిర్వహించిన దండయాత్రల సమయమున తెలంగాణ ప్రాంతమున కేతెంచిన సైనికులు, రాజకీయోద్యోగులు, కవులు, పండితులు, శిల్పకారులు, వ్యాపారులు అచటనే స్థిరపడి క్రమముగా తెలుగువారుగ పరిగణింప బడినారు వేములవాడ చాళుక్యులకు రాష్ట్రకూటాన్వయులతో సంబంధ బాంధవ్యము లుండుటవలన రాష్ట్రకూట సామ్రాజ్య మందున్న అనేక కుటుంబముల వారు వచ్చి తెలుగుదేశమున స్థిరపడి యుండిరి

ఆనాటి సంఘమున విశ్వకర్మలకు విశేష గౌరవాదరములుండెను విశ్వకర్మలు శిల్పకారులు వీరు వేములవాడ రాజ్యమందలి పోదన నగరము, చెన్నూరు, మంత్రకూటము, కాళేశ్వరము, గంగాధర, వేములవాడ పట్టణములందు స్థిర నివాసులై శిల్పులుగా ప్రసిద్ధిగాంచిరి రాజులు, తదితరులు వేయించు శాసనములను వీరు రాగిరేకుల పైనను శిలా స్తంభముల పైనను చెక్కుచుండిరి వీరు శిల్పులుగను శాసన లేఖకులుగను పిలువబడినారు. తొలుత వీరు జైన మతస్థులు అటుపిమ్మట వీరు శైవమతమును స్వీకరించి ఆచార్యులుగ పిలువబడినారు వీరికి జీతబత్తెములు గాని మడిమాన్యములు గాని రాజు లిచ్చు చుండిరి.

రాజులు విజయచిహ్నములుగను, వితరణ చిహ్నములుగను, స్మారక చిహ్నములుగను దానములిచ్చి శాసనములు వేయించుచుండిరి బ్రాహ్మణులు మంత్రులుగను, దండనాయకులుగను నియమింపబడుచుండిరి రాజులు సకలశాస్త్రములయందు ప్రవీణులౌటయేగాక పండితుల నాదరించుచు, లలితకళలను పోషించుచు, శిల్పులను లలితకళాశాస్త్రజ్ఞులను గౌరవించుచుండిరి

తెలుగుసీమలో ఆనాడు నాల్గు దినములు మహావైభవముగ వివాహములు జరిగుచుండెను వధువును పెద్దలుగాని, వరుని తల్లిదండ్రులుగాని చూచి, కాంపత్యము నిర్ణయించి, నిర్ణీత తిథులలో కన్యకకు ముద్రారోహణము చేయుచుండిరి ముద్రారోహణము గ్రామ ముఖ్యుల సమక్షమున పూర్తియగుచుండెను ఆనాడు సంఘమునందట్టి ఆచారము ఉండెను వివాహానంతరము బంధువులు వసంతమాడుచుండిరి

భటవృత్తిలోనున్న కుటుంబములవారిలో వివాహవిచ్చు ఆచారముండెను దక్షిణాది కులముల వారిలో నట్టి ఆచారము లేకుండెను

ఆనాడు రాజకుటుంబములందు జరుగు వివాహములు వైభవోపేతముగ నుండెను ఈ వివాహములు జరుగునపుడు రాజ్యమందంతట ప్రజలు వేడుకలు చేసుకొనుచుండిరి వివాహ మండపము తోరణములతో, పుష్పములతో నలంకరింపబడి శోభాయమానముగ నుండునట్లు చేయుచుండిరి వివాహ వేదికపై ప్రోలు పోయుచుండిరి ప్రోలు పోసిన పిదప వేదికపై గల పెండ్లిపీట మీద వధూవరులాసీనులగుచుండిరి

వధూవరుల చేతులందు జీలకఱ్ఱతో కూడిన ప్రాలు ఉంచుట ఆనాటి ఆచారము వివాహానంతరము వధూవరులు పరస్పరము జీరికాయుక్త తండులములు చల్లుకొనిరి అవి నేటి తలంబ్రాలవంటివి నాల్గు రోజుల వివాహ మతి వైభవముగా నిర్వహించి, నాల్గవ నాటి సాయంత్రము నుండి ఝాము రాత్రివరకు వధూవరులను రథముపైనగాని, పల్లకిపైనగాని, ఏనుగుపైనగాని ఊరేగించుచుండిరి

వేములవాడ రాజ్యమందున్న ప్రజలలో మూఢ నమ్మకములుండెను అంజనము వేయించుట ఆనాటి ఆచారము బాలికలు చిలుక బొమ్మలు, దంతపు బొమ్మల నాటవస్తువులుగ వాడుచుండిరి బాలురు బొంగరములాట, వనవిహారము, వేట వంటి వాటిలో పాల్గొనుచుండిరి

ఆనాటి ప్రజా వినోదములలో కోడి పందెములు, లకుముకి పిట్టల కొట్లాట, మేష మహిష యుద్ధములు, పావురాల పోట్లాటలు ముఖ్యమైనవి కొందరు చదరంగము, పుంజీతము, అష్టచెమ్మ వంటి ఆటలలోను, మరి కొందరు గీత, వాద్య నృత్యములయందును, కోలాటములు, బుఱ్ఱ కథలు, తోలుబొమ్మలాట వంటివాటితో వినోదించుచు కాలము గడుపుచుండిరి.

## శిల్పము :

వేములవాడ చాళుక్యుల కాలమున నిర్మించిన దేవాలయము లపురూప శిల్ప కళా శోభితములు. ఈ దేవాలయముల శిల్పము శిల్పకళాభివృద్ధికి తార్కాణము ఈ కాలమున జైనము వర్ణ వ్యవస్థ నంగీకరించినది బాదామీ చాళుక్యులు, వేములవాడ చాళుక్యులు జైనమతము నవలంబించి, జైనమతములకు జైనమునులకు, జినాలయములకు దానము లొసంగినారు జినాలయములను నిర్మించినారు

వేములవాడ చాళుక్యులలో కొందరు రాజులు జైన మతానుయాయులు వీరు పాలించిన కాలమున నెన్నెన్ని జిన భవనములు, జినాలయములు, జైన బసదులు నిర్మింపబడినవి ఈ జినాలయముల కుడ్యములపై జైన తీర్థంకరుల జీవిత ఘట్టములు చిత్రించబడినవి

వేములవాడ చాళుక్యులు తమ రాజ్యమున నిర్మించిన దేవాలయములను, జినాలయములను శిల్ప కళా సౌందర్య ముట్టిపడునట్లు రూపొందించినారు బృహచ్ఛిలలతో బాదామీ చాళుక్య శిల్పమునకు దీటుగా నుండునట్లు వీరు నిర్మించిన జైన దేవాలయములు ప్రసిద్ధి గాంచినవి

ఈ రాజ వంశీయులు నిర్మించిన జైన దేవాలయములు, చక్కని విగ్రహములతో నొప్పారుచుండెననుటకు ఆయా ప్రాంతములందు లభించిన శిథిలములే తార్కాణము

ఈ కాలమున నిర్మింపబడిన జైన దేవాలయములు, శివాలయములు బృహచ్ఛిలా నిర్మితములు ఏ కాండపు రాలి గండారపు బొమ్మలు కుర్క్యాల గుట్టపై నిర్మింపబడినవి ఇవి పంప మహాకవి సోదరుడు జినవల్లభునిచే చెక్కింపబడినవి బొమ్మలున్న గండశిలపై శాసనము చెక్కబడినది

ఈ శిల్ప సంప్రదాయములో, బృహద్విగ్రహ నిర్మాణపద్ధతి శిల్పుల మనోభావముల కనుకూలముగ మారుచు వచ్చినది రాజులు బృహద్దేవాలయముల నిర్మాణమునకు కుతూహలులై యుండ, శిల్పులాయా శిల్ప నిర్మాణపద్ధతి ననుసరించి అట్లు నిర్మించినారు

ఆంధ్రదేశమున ముఖ్యముగా తెలంగాణ ప్రాంతమున గుప్త శిల్పము రూపుదిద్దుకొనెనది రాజుల ఆదరణము శిల్పకళాభిమానము తెలుగుసీమలో శిల్పకళాభివృద్ధికి తోడ్పడినవి

వేములవాడ చాళుక్యులు నిర్మించిన భవనములు శిథిలమైనవి పోదన దుర్గము, గంగాధర, వేముల వాడలయందు నిర్మించిన దుర్గములు శిథిల రూపమున కనిపించుచున్నవి వీరి కాలమున వేములవాడలో రాజేశ్వరాలయము, బద్దెగేశ్వరాలయము, భీమేశ్వరాలయములు శిల్పకళతో నొప్పారునట్లు నిర్మింపబడినవి ఇవి రాజుల పేర్లతో నిర్మించిన ఆలయములు బద్దెగడు నిర్మించిన శుభదామ జినాలయము, పెద్దనార్యుడు నిర్మించిన ఆదిత్య గృహము శాసనములందు ప్రశంసింపబడినవి వేములవాడ నగరేశ్వరాలయము వ్యాపారులు నిర్మించినట్టిది

బోధన్ లేక పోదన నగరమున అనేక జినాలయములుండెను ఇచట జైనమత సంబంధమైన శాసనములు లభించినవి గోదావరి నది కుత్తర తీరమందున్న బాసర గ్రామమున జైన మునులకు సంబంధించిన శాసనములున్నవి ఈ శాసనములు వేములవాడ చాళుక్యుల నాటివి

బోధన్ పట్టణమునం దనేక శివాలయములున్నవి ఈ ఆలయములు బృహల్లింగములను కలిగియున్నవి ఎత్తైన నందులు, త్రికూట దేవాలయము లిచట నున్నవి

జైన తీర్థంకరుని విగ్రహ మిచట నల్లరాతిలో మలచబడియుండెను ఈ విగ్రహము విఱిగి ముక్కలైనవి. ఒక్క తల భాగము మాత్రము బోధన్‌లోని రహదారి బంగళా ఆవరణమున పడి యున్నది

వేములవాడ, బోధన్, చెన్నూరు, కాళేశ్వరములందున్న దేవాలయములు, గంగాధర పర్వాత్యల లందున్న జైన దేవాలయములు బసదులు వేములవాడ చాళుక్య రాజుల శిల్ప కళాభిమానము నకు, భక్తితత్పరకు నిదర్శనములు

## శాసనములందలి వ్యక్తుల పేర్లు :

### రెండవ అరికేసరి కరీంనగర్ శాసనము

1 వినయాదిత్య యుద్ధమల్లుడు
2 విష్ణుభట్టు
3 అప్పనయ్య
4. ధారవయ్య

### రెండవ అరికేసరి వేములవాడ శాసనము

5 మొదటి అరికేసరి
6 రాష్ట్రకూట ధ్రువరాజు
7 నాల్గవ విష్ణువర్ధనుడు
8 మొదటి నరసింహ వర్మ (రాజాదిత్యుడు)
9 రెండవ యుద్ధమల్లుడు
10 మొదటి బద్దెగడు
11 మూడవ యుద్ధమల్లుడు
12. రెండవ నరసింహవర్మ
13 రెండవ అరికేసరి

### రెండవ అరికేసరి వేములవాడ శాసనము

14 మహీపాలుడు
15 రాష్ట్రకూట మూడవ ఇంద్రవల్లభుడు
16. రాష్ట్రకూట గోవింద రాజు
17 బిజ్జయుడు (విజయాదిత్యుడు)
18 వన్నయార్యుడు
19 తంత్రపాలుడు పెద్దనార్యుడు
20 నాగమార్యుడు
21 మల్లికార్జునుడు
22 లింగన
23 విద్యారాసి పండితుడు
24 వ్యాఖ్యాని భట్టారకుడు

### కుర్క్యాల శాసనము

25 అభిమాన చంద్రుడు
26 భీమపయ్య
27. జినవల్లభుడు
28 పంపార్యుడు
29 భీముడు

### బద్దెగుని వేములవాడ శాసనము

30 బద్దెగుడు
31 సోమదేవసూరి

### ముడవ అరికేసరి రేపాక శాసనము

32 మూడవ అరికేసరి
33 ఉజయ
34 కామ
35 రామ
36 తుక్కయరేవణ
37 పుణ్యారామ
38 కొమ్మయ్య

### ఆహవమల్లుని వేములవాడ శాసనము

39. ఆహవమల్ల దేవుడు
40 మహేశ్వరశక్తి పండితుడు

### చికరాజు వేములవాడ శాసనము

41 చాళుక్య జయసింహదేవుడు
42 చికరాజు
43 పొల్లిరడ్డి
44 కొండియరడ్డి

### రాజాదిత్యుని వేములవాడ శాసనము

45 త్రిభువన మల్లదేవర
46 రాజాదిత్య నరేంద్రుడు
47 రాజేంద్ర చోళుడు

### కుమార సోమేశ్వరుని వేములవాడ శాసనము

48 కుమార సోమేశ్వరుడు
49 బల్లవరస

### జగద్దేవరాజు వేములవాడ శాసనము

50 శ్రీమజ్జగద్దేవరసు
51. బ్రహ్మేశ్వర పండితుడు

### కురువగట్టు శాసనము

52. క్షీరగృహుడు

### మొదటి అరికేసరి కొల్లిపర తామ్ర శాసనము

59 సద్యశ్శివాచార్యులు
60 ముగ్ధశివాచార్యులు

## స్త్రీల పేర్లు

1. జాకవ్వ 2. రేవక నిర్మాడి 3 లోకాంబిక

## శాసనములలోని విషయములు, గ్రామములు, నాడులు, ముఖ్య స్థలములు:

1 నూతులపాడు - రెండవ అరికేసరి కరీంనగర్ శాసనము

**రెండవ అరికేసరి వేములవాడ శాసనము**

2 చిత్రకూట దుర్గము
3 వేంగీ దేశము
4 లాట దేశము
5 సప్తమాళవములు
6 ఘూర్జరము
7 కాళప్రియము
8 వేములవాడ

**జినవల్లభుని కుర్క్యాల శాసనము**

జేంగినాడు
వంగిపట్టు
గొజ్జికట్ట నిడుంగొజ్జ
సబ్బినాడు
ధర్మపురము
వృషభగిరి

**మూడవ అరికేసరి రేపాక శాసనము**

అతుకూరు 70
వమ్మి 12

**చిరరాజు వేములవాడ శాసనము**

లేంబులవాడ
నోవపురము

**రాజాదిత్యుని వేములవాడ శాసనము**

కాంచీపురము
సంకయపల్లి
చోళ్లకటకము

**కుమార సోమేశ్వరుని వేములవాడ శాసనము**

సబ్బిసాసిరము
ఒళియగ్రహారము
ఇల్లిందకుంట - జగద్దేవరాజు వేములవాడ శాసనము

**మొదటి అరికేసరి కొల్లిపర తామ్రశాసనము**

బెల్మొగ
ఊరిగె
రామడుగు
పరివాతుర్ల
పోతునోదుడి
పుల్చెఱువు
తువతోరు
వనికటువలు గ్రామము - మూడవ అరికేసరి వర్బిణి తామ్రశాసనము

ఇవిగాక దేవాలయములకు, జినభవనములకు, జైన దేవాలయములకు, బసదులకు, జైన మునులకు దానములిచ్చు సందర్భమున వేయించిన శాసనములందు వింత వదములు, వింత అక్షరమగు ఱ కనిపించుచున్నవి ప్రాచీన శాసములం దిట్టి 'ఱ' అక్షరము ళ, డ, కారమునకు బదులుగా వ్రాయ బడినది

—. ० —

# వేములవాడ శాసనములు

## 1. రెండవ అరికేసరి కరీంనగర్ శిలా శాసనము :

ఈ శాసనము కరీంనగర్ పట్టణమునందున్న పురావస్తు శాఖవారి మ్యూజియము ఆవరణలో భద్రపరుచబడినది శాసనమును వేములవాడ రాజ్యపాలకుడగు రెండవ అరికేసరి శక సంవత్సరము 869 వరాభవ కార్తీక బహుళ ఏకాదశి సోమవారమునాడు, కౌశికగోత్రోద్భవుడును, నూతులపాడు గ్రామ నివాసియు, విష్ణుభట్టుని పౌత్రుడును, అప్పనయ్య పుత్రుడును నగు ధారవయ్య అను విప్రునకు అరిపినపల్లి గ్రామమున యాభై మత్తుల్ల నీరు నేలను దానమిచ్చు సందర్భమున వేయించెను.

శిలా స్తంభముపై నాలుగు వైపుల చెక్కబడిన ఈ శాసనము, మొదటి ప్రక్క 21 పంక్తులు, రెండవ ప్రక్క 24 పంక్తులు, మూడవ ప్రక్క 25 పంక్తులు, నాలుగవ ప్రక్క 25 పంక్తులు మొత్తము 95 పంక్తులలో చెక్కబడినది

శాసనారంభమున పంప మహాకవి రచించిన విక్రమార్జున విజయములోని (5) పద్యములు చెక్కబడినవి శాసనాంతమున 'స్వదత్తంపరదత్తంవా' అను శ్లోకము తరువాత కన్నడ వచనమున శాసనము రక్షింపని వారికి కలుగు పాప ఫలము తెలుపబడినది శాసనము కన్నడ భాషలో నున్నది

వేములవాడ చాళుక్య వంశావళి తరువాత రెండవ అరికేసరి "సమధిగత పంచమహా శబ్ద, మహా సామంతాధిపతి సమస్త భువన సంస్తూయమాన, చాళుక్య వంశోద్భవం పాంబరాంకుశనమ్మ గంధ వారణం, గందేభ విద్యాధర నుదాత్త నారాయణం, ప్రత్యక్ష వార్ధమెయారూఢ సర్వజ్ఞ గుణనిధి గుణార్ణవ ప్రియగళ్లం త్రిభువన మల్లం సామన్తచూడామణి నొడితైగెల్వం" అని వర్ణింపబడినాడు

రెండవ అరికేసరి వేములవాడ చాళుక్య వంశపు రాజులలో గొప్పవాడు రాజనీతిజ్ఞుడు కవి వందిత పోషకుడు రాష్ట్రకూట చక్రవర్తుల సామంతుడు బలపరాక్రమోపేతుడు అనేక యుద్ధము లందు విజయము గాంచినవాడు అరివీర భయంకరుడు రాష్ట్రకూట మూడవ ఇంద్రవల్లభుని తనయ రేవక నిర్మాడిని వివాహమాడినవాడు మహాసామంతాధిపతి

ఈ శాసనము శకవర్షము 869 నాటిది కావున ఈ శాసన కాలము క్రీ శ 946 అనగా అరికేసరి పదిహేడవ విజయరాజ్య సంవత్సరమున వేయించినట్టిది అప్పటికే పంప మహాకవి విక్ర మార్జున విజయకావ్యమును పూర్తిచేసి యుండుటవలన ఆ కావ్యమందలి పద్యములీ శాసనమున స్థాన మాక్రమించినవి

# శాసనము - మూలము

## మొదటి ప్రక్క

1 స్వస్తి శ్రీ మచ్చళు
2 క్య వంసవ్యోమా
3 మృత కిరణ నెనివ కా
4 న్త్రియునాళ కొణ్డి మహిమొ
5 ళాత్మవంశ సిఖామణి ఒ
6 సమె సెయె జుద్ధమల్లనెగ
7 ల్డం (1) ఆత్మభవనాధ రాధి
8 ఫ నాత్మజన జనహుష వృధుభ
9 గీరత నళ రామాత్మజ రనిళి
10 సి నెగల్డ మహాత్మ నరసిఙ్గ
11 నటివి నాళ్ వరమాత్మం (2)
12 ఆజాకయ్యెగ మావసుధా
13 జయో వల్లభంగ మతి విశ
14 ది (ఙ) యశోరాజితనెని వరికే
15 సరి రాజత్తే జోగ్నిమా (మ) గ్నరి
16 పునృప శలభం (3) మగనాళె
17 నాగివాగళె నెగత్తెయె క్ష్పిర
18 దెసక దొళ్నెగలెమగం సమ
19 నెనెపుట్టి రొడం కొళ్మగ గొణ్డు
20 దు భువన భువన మరికేసరి
21 యా (4) చాగదకంభ

## రెండవ ప్రక్క

1 వాగదకంభ మన్ని టిసివి
2 రద శాసన మన్నెగల్బ కో
3 ప్పగద ఒడ్డుం గళనెకొ
4 ణ్డజగ త్రిపయుం గళొ . .
5 శకాౢగ (౮) ఘంది ఒద్దెనినాన
6 రసింఘని నత్తపాౢరిం మే
7 గవెొదళ్ద చాగ దొళమెన్ది
8 ఒటిర దొళం గుణాణ్నవం (5)
9 స్వస్తి సమధిగత పఞ్చమ
10 హాశబ్ద మహాస (నా) మన్తా
11 పతి సమస్త భువన సంస్తూ
12 యమాన వా పక్యె వంశోద్భ
13 వం పాంబరాంకుశ నమ్మన గ
14 న్ధవారణం గన్ధేభ విద్యాధ
15 రనుదాత్త నా . ణం ప్రత్యే
16 క్షవాద్ధమె యాదిూధ సర్వ
17 జ్ఞ గుణనిధి గుణార్ణవ ప్రి
18 య గళ్లం త్రిభువన మల్లం
19 సామన్త చూడామణి నొడ
20 త్తె గెల్వం శ్రీమదరి కేస
21 రి యర సరయ్యం గొడెయ
22 నెత్తిని ఇవ్వణతిచా...
23 ముం దుష్ట నిగ్రహ వి
24 ష్ట ప్రతిపాలన దిం రాజ్య

రెండవ అరికేసరి కరీంనగర్ శిలాశాసనము



మొదటి ప్రక్క

## మూరవ ప్రక్క

1 సక వర్ష 869 నె
2 య పరాభవ సం
3 వత్సరద కార్త్తిక బ
4 హుళ ఏకాదసి సోమ
5 వారదన్దు శ్రీ మదరికేస
6 రి యర సర్చ్చా దన దణ్డిగా
7 విఱత్తువ శ్చైఱ తటియ టీ
8 డినాళ్ కౌశిక గోత్ర నూ
9 తులపాటు బోవం విష్ణు భ
10 ట్టర మగం అప్పణయ్య అ
11 ప్పణయ్యన మగం ధారప
12 య్యం గెత్తుష్టి దానం అరివ
13 న వణ్ణియ బడగణ దెసెయ
14 గాముణనెద్దెయ కెంగనిళ నా
15 రెయొళయ్వత్తు మత్తర్నెలన న
16 రికేసరి యరసర్ద్దాయెం గెయ్ద
17 రుదక్కెసిద్దాయం ముద్దరణగా
18 ముణ్డగె ఇన్మత్త నెర్లక్కె సి
19. రు మంకుళవరు ఈ స్థితి
20 యం దప్పద తునగరూర
21. అయ్యప గాముణ్డను శావు
22 లూర దెన్తెయను మూల
23 గూర పోమయ గాముణ్డె
24 ——— ద మహాజ
25 న దిణ్ణమయ్యను కన్దప్పర్య

## నాలుగవ ప్రక్క

1. తాఱూర మహాజంకస
2 నయ్యనుం అప్పణను చణ్డి
3 య రాజనుం నాజ రాజను
4 రేకుటికియ మల్లప రాజను
5 సాక్షియాగె గాముణ్టనెచట్ట
6 య్యనుం తమ్మం మకయ్య
7 ముసిద్ధికెక్కిసిదకమ్బ॥ చను
8 లూర గాముణ్డం చింగపులిగె
9 ఒను మత్తరు విఱుమడియు
10 మాయ్యర భోగపతి గామణ్డ
11 యగమెరడు పలదొళం కె
12 ఱెయమున్ద(ణ్ణె)గుడువ నేల్లు
13 ఖణ్డుగ పన్నెరడు ఈ స్థితియా
14 గ్గెతప్పు సల్లకుళవత్తళె
15 యపెర్గ్గడెజుట్టయ్యన సం
16. ధిష్టిత సేనబొజయ నా
17 పడియత్తం శ్రీమమ్న బరె
18 దొ॥ స్వదత్తం పరదత్తం వ
19 యోహరేతి వసున్ధరి ష
20 ష్టి వరిష సహస్రాణి వి
21 ష్టయాం జాయతే క్రిమి॥ ఇ
22 దం తప్పదవ ప్రయాగెయ
23 బారణాసియు మడిద పా
24. ప మకమరసరజెయ
25 మిక్కె॥

18 స్స్వ భావదుగ్గఁం కిళతంజహార॥ తస్యోత్మజో ద
19. క్షిణబాహు దణ్డ చణ్డాసి ధారాహత వైరి
20 షణ్డో బళాద్గృహీతాఖిళ వేఙ్గిదేశ బ్బా
21. తిస్మ పృథ్వీ మరికేసరీశః॥ భూయో స్మాన్న
22 రసింహవమ్మఁ నృపతి భూఁమిం సమాపాదయ
23. న్రాజాదిత్యఇతి క్షమాపతి రతా (తః) శ్రీయుద్ధమ
24 ల్లోనృపః। త్యక్తాయేన దధీచి కణ్ణఁ శిబయ స్త్యాగైః క్షితౌ
25 భూభుజబ్బళ్చా ద్బద్దెగ కల్పదారు రపరః శ్రీ యుద్ధ
26 మల్లబ్బునః॥ తతస్స రాజన్య శిరోమణీనాం పాదార
27 విన్దేన రుచోహరద్యః బభూవనామ్నా నరసింహ దేవః స్తం
28 భాత్పుమాన్లోక భృతావి వాద్య॥ య(స్స)త్ర దుస్సాధ్యతరం నృ (రాన్న్వ)

## రెండవ ప్రక్క

1. పాణాంన్నిజిఁత్య సద్య స్సమరాంగ
2 ణేషు విన్యస్యకేహ స్త మతోనతానాం
3 స్తాన్మాళవ (వా) న్యః కరదీచకార॥ ప్రత్యుద్గతాం
4 గూజఁర రాజసేనాం నిజ్జిఁత్య రాజాస్వయ మ(మే)క
5 ఏవకాళ ప్రియే రాజ కదంబకస్య స్తంభే స్వ(శౌ)
6 య్యఁం విలిలేఖ శైశే॥ తస్యోదపాది ఒళవ
7 త్వర చక్రకుంభి కుంభస్థళోద్దళన దక్ష కృ
8 పాణపాణిః భీతానతారినరపాళ కిరీ
9 ట కోటి సంఘట్టితాంఘ్రి సరసీజ విరాజ మా
10 నః। శ్రీమాన్మహీ పతి స్స్వాక్షాన్నామ్నా వీరో
11 రి కేసరీ ప్రాదుబ్బఁభూవ తేజస్వీ ప్రాతా (త)
12. భాఁను రివోదయాం (యాత్)॥ సమస్త సామన్త శిఖా
13 మణీనాం ప్రభా ప్రపాతాయిత శావ్వఁ రాస్వం (రాం సః)
14 సదారినారీ నయనాంబుజానాం లక్ష్మీం హి
15 మాసార ఇవాహ రద్యః॥ సామన్తాన్దణ్డము

16 ఖ్యాన్నిజ భుజపరిఘాం ప్రస్ఫురత్ఖడ్గ ధారా
17 ం నీరాంభోరాశి మగ్నాం సురగకరి ఘటావత్తి స
18 ంవత్తి యుక్తాన్ కృత్వావన్యాన్యయ్యా మాయ్యాం స్వజనపరి
19 జనైస్సన్నిహత్యాజి రంగే। కృద్ధేగోవిన్దరాజే శరణ
20 ముపగతో రక్షితో యేనబిజ్జః॥ దేవీం రేవకనిమ్మ
21 డీం క్షితిపతే రిన్ద్రిస్య పుత్రీమ్నుతాం పౌలోమీ మివ
22 వాసవః శ్రియమివ శ్రీమన్మర ధ్వంసకః శ్రీ రత్నం
23. పరిణీయ యేన నితరంతస్యాస్స్వపత్నీకృతానూ
24 నం సప్త సముద్ర ముద్రిత మహీమ్నోన్నతే నాథు
25. నా॥ తేన భీతానతాఖిళ బళవది ళాపాళ మౌ
26. ళి మాణిక్య రశ్మిమాళా లాళిత చరణకమ
27 ళ యుగళేన శరణాయత క్షితిపాళ ప్రాణ

## మూడవ ప్రక్క

1 దక్షణదక్ష కౌక్షేయ కోపల తీక్ష్యణ దక్షిణ
2 భుజాగ్గళేన కాన్త్యా కాన్త కాన్తా జన మనోనయ
3 న వల్లభేన కరేణు పుత్రేణేవ స్స (స) కళగజచి
4. కిత్స్వా కోవవదోన (కోవిదేన) గౌతమే నేవైకశీతిరసావ
5 ధ (ధి) విధి కళశేన రాజాత్మ జేనేవ పరీక్షా
6. విధాన దక్షిణః వార్ధళినేవ బన్ధురకమ్మాళ
7 స్కన్ధ సంపన్న పరాయణేన ఈశ్వరేణేవ
8 విజిత మనోజే నో మాప్రియేణ చ
9 నారాయణేనేవ గోవర్ధన నేన ధరేణచ
10 చతురాన నేన (నే) వం చతురాన నేనవ। సక
11 ళ కళానిళయో నవకళా ధిర పత్క
12 ముదానన్దకరేణ కాన్తిమతాచవనజా (జ)
13. బన్ధునేవ ప్రబోధిత బన్ధుర బన్ధు వ
14 దన వనజేన నిగసార (రా) తితిమిరేణ

15 చ సహస్ర కిరణన దతుళ తేజసా
16 శ్రీమదరికేసరి మహారాజేన॥
17 స్వస్తి సమధి గత పంచ మహాశబ్ద మహా
18 సామన్తాధిపతి సమస్త భువన సంస్తూయ మా
19 న చాళుక్య వంశోద్భవం పాంబరాంకుశనమ్మన గ
20 న్ధవారణం గన్దేభ విద్యాధర నారూఢ సర్వ్వజ్ఞ
21 నుదాత్తనా రాయణం నోళుత్తె గల్వాం గుణనిధి గుణా
22. ర్ణ్ణవం శరణాగత వజ్ర పంజరం ప్రియగళ్ళం
23. త్రిభువనమల్ల సామన్త చూడామణి శ్రీ
24 మదరికేసరి యరసర తత్పాద పద్మోప
25. జీవి సమస్త రాజ్యభరనిరూపిత మహా
26. సన్ధి విగ్రహ పదవీ ప్రతిష్ఠితం సమస్త
27. శాస్త్రపారగం శ్రీమత్సన్ధి విగ్రహ గుణాంకు
28 శేన॥ త (తాఅంఫాల్లాయన)
29. న్నజన పీసదియం ఆదిత్యం
30. గెబిట్ట

## నాలుగవ ప్రక్క

1. శ్రీమాన్పృథీబ్బ్ర్ద్దగ భూమి భర్తు స్తం
2 త్రాధిపాలో జని నాగమార్య్యః గుణార్ణ్ణ
3 వో ప్వీ పతితంత్ర పాళ స్తస్యాత్మజోజాయ
4 త పెద్దణార్య్యః॥ తేనాభ్యర్థితో దేవతా వన్ద
5 న నిమిత్త మాగతస్వని మ్నాపితాదిత్య గృహా
6. యాగతాభ్యాగతజన సత్ర నిమిత్తముత్తరా
7 యణపుణ్య సంక్రాన్తిదివసే శతనివర్తనసం
8. ఖ్యాతభూమి క్షేత్ర మష్టనివర్తన సంఖ్యాత
9. పానీయ భూమి క్షేత్రం చ లేంబుళ వాట
10. క వత్తరేశాన కోణే శ్రీమదరికేసరిక్షితి
11 సతిరదాత్॥ తత్ర రాజేశ్వరాదిత్య గృహ బద్దె

12 ర్వ నగరేశ్వర ప్రభృతి చతుస్థానాధి వా

13 ు స్సాక్షి మల్లికార్జున వ్యక్తలింగి విద్యారాశి

14 వ్యా(ఖ్యా)ని భట్టారకశ్చ సాక్షిణః॥ చన్ద్రశ్రేష్ఠి ప్రభృ

15 తయో నవ శ్రేష్ఠినశ్చ సాక్షిణః

16 నిస్పృహైకాగ్రణీస్సూరి స్థానాధిష్ఠాయకః స్వయం

17 తాతవీయాన్వయే జాతః పణ్డిత మునీశ్వరః

18 స్వధర్మ్మవదయంధర్మ్మః పాళనీ యోనరాధిపైః

19 నధర్మ్మ్యా యాస్థితేస్సన్తః ప్రచ్యవన్తి కదాచన।

20 కాలక్షేపోనకర్తవ్యం ఆయుక్షీణో దినేదినే॥

21 యమస్య కరుణానాస్తి ధర్మ్మస్యత్వరితాగతిః॥

22 అనిత్యాని శరీరాణి విభవోనయ్య శాశ్వతః

23 నిత్యం సన్నహితో మృత్యుం కర్తవ్యోధర్మ్మసంగ్రహః

24 తస్య క్షేత్రస్య ద్వాదశ ద్రమ్మ సిద్ధాయః॥



# 3. కుర్క్యాల గండ శిలాశాసనము

కరీంనగర్ జిల్లాలోని గంగాధర మండల ప్రజాపరిషత్పరిధిలో కుర్క్యాల గ్రామమున్నది. ఈ గ్రామము కరీంనగర్ - జగిత్యాల రోడ్డుపై కరీంనగర్ నుండి 18 కిలోమీటర్ల దూరమున నున్నది ఈ రోడ్డుకు కిలో మీటరు దూరమున బొమ్మలమ్మ గుట్ట యున్నది

వేములవాడ రాజ్యము నేలిన రాజులలో రెండవ అరికేసరి ప్రథమ గణ్యుడు ఇతడు కన్నడ భాషా పోషకుడు, గొప్ప వీరుడు, సకల శాస్త్రములందు ప్రావీణ్య మున్నవాడు క్రీస్తు శకము పదియవ శతాబ్ది రెండవ పాదమున, రాష్ట్ర కూట చక్రవర్తుల మహా సామంతాధిపతిగను, రాష్ట్ర కూట ఇంద్ర వల్లభుని జామాతగను, అప్రతిమాన ప్రతిభా విశేషములు కలవాడుగను కీర్తి వహించినాడు

రెండవ అరికేసరి ఆస్థాని పంప మహాకవి కన్నడ భాషలో విక్రమార్జున విజయ మను మహా కావ్యమును, జైన తీర్థంకరులకు, జైన మునులకు సంబంధించిన ఆది పురాణమును రచించిన మహాకవి పంపడు.

పంప కవి సోదరుడు జినవల్లభుడు జైన మతాభివృద్ధికి పాటుపడినవాడు కుర్క్యాల గ్రామ శివారులోనున్న బొమ్మలమ్మ గుట్టపై నొక గండ శిలయున్నది దానిపై జినవల్లభుడు సంస్కృతాంధ్ర కన్నడ భాషలలో నొక శాసనమును వేయించెను

జైన మతమునకు చెందిన ఆద్యంత తీర్థంకరుల ప్రతిమలు, కూష్మాండినీ దేవి ఈ శిలపై చెక్కింపబడినారు ఈ బృహత్ప్రతిమల క్రింది భాగమున 11 పంక్తులలో జినవల్లభుడు వేయించిన శాసనమున్నది

జైనమత గురువులను, పండితులను, జైన మునులను జినవల్లభు డాదరించి పోషించినట్లును, జైన మందిరములను నిర్మించి, తటాకములను త్రవ్వించి, జైన మతాభిమానమును ప్రకటించి, జైన మతాభివృద్ధికి పాటుపడినట్లును ఈ శాసనము వలన తెలియుచున్నది.

జినవల్లభుడు సకల కళలయందు ప్రావీణ్యమున్నవాడు భవ్యరత్నాకరుడు గుణపక్షపాతి చతుర కవిత్వ రచనయందు నేర్పరి. వివిధ కావ్య రచనా ధురంధరుడు. కవిత్వ తత్వమును తెలిసిన వాడు ఆచార్య పీఠ మలంకరించిన మహనీయుడు. సంగీతశాస్త్ర పారగుడు జినభవనములను నిర్మించుటలో కడు నేర్పరి.

